# కలత - స్వయంవరం
# సన్మతి దే భగవాన్

రచన

డాక్టర్ కొట్టుపాటి గంగాధరరావు
బాపట్ల (గుంటూరు జిల్లా)

పబ్లిషర్సు
కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు
శ్రీ సత్యనారాయణ బుక్ డిపో
రాజమండ్రి.

నా నాటకములు ప్రదర్శించకోరేవారు ముందుగా లిఖితపూర్వకంగా నా అనుమతిపొందాలి.

అనుమతికివలయు తపాలబిళ్ళలు ప్రదర్శనతేదీ, సమాజపుపేరు కార్యదర్శిపేరు తప్పకుండా తెలియ జేయాలి.

ఏది తెలియకపోయినా అనుమతి పంపటం సాధ్యంకాదు.

గంగాధరరావు.

## పాత్రలు

1. భీమయ్య— స్టేషన్ జమాను. వృద్ధుడు 65 సం॥రాలు.
2. సీతారామయ్య— 50 ఏండ్ల ప్లీడరు
3. రాజయ్య— 55 ఏండ్ల రిటైర్డ్ ఆఫీసరు
4. సీతమ్మ— రాజయ్యభార్య 48 సం॥రాలు.
5. రుక్మిణి— 16 ఏండ్ల యువతి
6. మరొక యువకుడు— రుక్మిణి ప్రియుడు.

# కళత్ర

(ఏకాంకిక)

[ఒక పల్లెటూరి రైల్వేస్టేషన్‌లో ప్రయాణీకులగది. స్టేషన్ జమాను, గదెవూడుస్తూ వుంటాడు. ఇంతలో ఒక ముసలాయన ఓసంచితోపాటు వచ్చి కూర్చోబోతాడు.]

స్టేషన్ జమాన్—అయ్యయ్యా! అయ్యో! కాస్త ఆవతలిల నుంచోండయ్యా! వారంరోజులనించీ తుడవ లేదు. ఇవ్వాళన్నా తుడిస్తే సుబ్బరంగా కూచుందురుగాని.

ముస—ఊఁ అల్లాగేకానీయ్యి. రామరామ, ఇదివారంకాదు (వెళ్ళి దర్వాజాదగ్గరనుంచుంటాడు) కొన్ని నెలలబట్టీ తుడవ లేదులాగుంది.

జమాన్—తుడవకేముంది! వారంవారంతుడిచి తాళంవేస్తా. కొన్ని నెల్లబట్టీ తెరిచివుంచవలసి లేకు లెండి. ఇవ్వాళ పొద్దున్నే మీరువచ్చారు గాని అసలీబండికి ఎవరూరారు.

ముస—ఆఁ నాఖర్మం. ఈ బండికేరావాల్సివచ్చింది. అవతల కనెక్షన్ అందదని ఆదరాబాదరావచ్చా.

(తుడవటంపూర్తి చేసి)

జమా—కూర్చోండి, బాబూ!

ముస—కూర్చుంటాగాని, ఇక్కడెక్కడన్నా కాస్తకాఫీ దొరుకుతుందీ?

జమాన్ — కాఫీ, కొబ్బరితోటావాళ్లా ఒకనాయరు పెట్టి గవాళ్లా తీసిపోయాడండీ. మొన్నీమధ్యే ఓ అయ్యోరుకూడా అంత పనిచేశాట్ట. ఇవ్వాళ తెరిచాడో లేదో! చూసివస్తానాగండి.

మున — నాయరు దివాళాతీసి పదేళ్ళయిందిగా!

జమాన్ — అయిందాఅండీ; అప్పుడే! మొన్నీమధ్యేగా! కొబ్బరిచెట్లేసినప్పుడేగా ఆదొడ్లో. అవున్లెండి, కొబ్బరి చెట్లుకాపట్టి నాలుగేళ్ళయింది.

మున — అతను దివాళాతీసేటప్పటికి ఈరెండోలైన్ వెయ్యలేదే?

జమాన్ — అవునండోయ్! 10పళ్ళ య్యేవుంటది. మాచిన్నోడి పెళ్ళి అయిందప్పుడే.

మున — అయితే నువ్వు చాలాపళ్ళుగా యిక్కడే వుంటు న్నావా ఏం?

జమాన్ — ఆ! వున్నదంతాయిక్కడేగదండీ. ఈలైన్ వేసిన కాణ్ణించే, యిక్కణ్ణేవున్నా.

మున — అహా. అయితే నీపేరు భీమయ్యా ఏమిటి?

జమా — అదేగదండి! అప్పుడు భీముడిలాగే వుండేవాణ్ణి లెండి.

మున — ఓనువ్వేటోయ్! అంత పెద్దమీసాలూనువ్వేనూ... ఆ మీసాలేంచేశావ్?

భీమ — తీసేశాలెండి. ఆ– మనవలుపుట్టింతర్వాత కూడా మీసాలేంటని అందరూ అంటేనూ–

ముస — సీ. సీతారాంగారికి నా పెద్దపావురమయ్యాలే.

భీమ — ఏందో-నాకేం అల్లాఅనిపించటంలేదుగాని, అందరూ మీలాగే అంటారు. నాకంతా మొన్నమొన్నలాగే వుంటుంది, అయితేబాబూ! మీదిఏవ్వూరు?

ముస — మాది యీవ్వూరుకాదుగానీ, నేను కరణంగారి మన వణ్ణి-కూతురుకొడుకును. ఏడాదిఏడాదీ యీవ్వూరొచ్చి పోయేవాణ్ణి చిన్నప్పుడు.

భీమ — కరణంగారి కూతురుకొడుకంటే... రామనాధంగారి కొడుకువా! పెద్దమ్మాయికొడుకువు. ఓరి నాకళ్ళు కాలి పోను. అప్పుడే మీసాలుగూడా నెరిశాయే, ఓరి మొన్న మొన్నదాకా యీప్లాటుఫారంమొక్కలు పీక్కెళ్ళే వోడివి గాదంటయ్యా.

ముస — ఆఁ ఆ- చిన్నప్పుడు తెగఅల్లరిచేసేవాళ్ళం. అప్పుడు నిన్నుచూడంగానే అదేపరుగు.

భీమ — ఆ- పిల్లలా ఏమన్నా?

ముస — ఆఁ! ఆఁ! ముగ్గురూ. ఇద్దరు మొగవెధవలు. ఓఆడ పిల్ల-

భీమ — అదృష్టవంతుడివే! చిన్నప్పుడూ, వయసులోగూడా, యిక్కడే షికారు చేసేవోడివి. నీపేరు మొన్నమొన్నటి దాకా అనుకుంటూనే వుండేవోళ్ళం నేనూ మా ముసిల్దీ. నీ పేరూ... ...

ముస — ఆఁ! సీతారామయ్యలే.

భీమ—ఆ! అమ్మాయి పేరు సీత. నువ్వు రామయ్యవి. బాగా కుదిరిందని అనుకునేవాళ్ళం.

సీతా—ఓ! అదా! నీకు బాగా జ్ఞాపకమే.

భీమ—అంతా మొన్న మొన్నే కాదంటయ్యా! మామాటే హాడి పుటకల్కి. అయితే సీతమ్మతల్లి బాగుందా?

సీతా—సరేలే! ఏ సీతమ్మ తల్లి?

భీమ—అల్లా అడుగుతావేం? ఆ యేళ ప్లాట్‌ఫారమంతా అంత గందరగోళం చేసి, ఆ పిల్లని పెళ్ళాడకపోతే, పాణాలే వద్దని పెమాణాలు చేశావుగా?

సీతా—చేశాను; ప్రమాణాలే జరిగాయి; కాని ఆ పెళ్ళి కాలేదుగా? మా వాళ్ళూ- వాళ్ళ వాళ్ళూ కలిసి గూడు పుఠాణిచేసి పెళ్ళి తప్పించారు. ఏమో! ఎక్కడుందో! ఎవర్ని పెళ్ళి చేసుకుందో! అంతా ముప్పైఏళ్ళనాటి మాట.

భీమ—ముప్పైఏళ్ళయిందా? నిన్న మొన్నగా నాకుంటే.

సీతా—నీకేమిటి? నాకూ అట్లాగేవుంది. ఈ ప్లాట్‌ఫారంలో ఏ ప్రక్క చూసినా ఆ సంగతులే జ్ఞాపకం వస్తున్నాయి. ఆవేళ, ఆ గందరగోళంనాడు, ఆ వంగిన చెట్టుకిందే, నుంచున్నాను. ఆ లాంతర్ స్తంభానికే తల బద్దలు కొట్టుకున్నాను. 30 ఏళ్ళయిందంటే నాకే నవ్వొస్తోంది. కాని 30 ఏళ్ళూ అయిపోయింది. జీవితమూ చివరి కొచ్చింది. కాస్త కాఫీహోటల్ వుండేదేమో కనుక్కో- తలనొప్పిగా వుంది- కాఫీ తాక్కపోతే.

భీమ—వస్తానుండమ్మా. కనుక్కొస్తా, అయితే యింతకూ ఆ సీతమ్మతల్లిని పెళ్ళిచేసుకోనేలేదన్న మాట.

[అంటూ వెళ్తాడు. అంతలోనే మరో కొత్త ముసలాయన- సీతారామయ్య అనుస్నువాడు ఓ పెట్టె Bed లతో ప్రవేశించి గుమ్మం దగ్గరనుంచుని]

కొత్త-ము—సీతా! ఇట్లారా; ఇక్కడ కూర్చుందాం. ఈగది తెరిచే వుంది. కుర్చీలుకూడా వున్నాయిక్కడ. (సీతారామయ్యను చూసి) పంతులుగారూ, మీరు యిట్లా వచ్చి కూర్చుంటారా? నూ ఆడవాళ్ళు వస్తున్నారు.

సీతా—ఓ- అల్లాగే. (తన సంచీతో పాటు దర్వాజా దగ్గరగా వచ్చి కూర్చుంటాడు. సీతమ్మ మరచెంబు - సంచీతో కూడా వచ్చి లోపలపక్క- కుర్చీలో కూర్చుంటూ)

సీ.—మీరామష్టర్ మళ్ళీ చెవలమీదనుంచి ప్రశ్నారేం? జలుబు చెయ్యటానిక్క. సరిగ్గా కప్పుకోండి.

కొత్త—అబ్బ! నాకు తెలుసులేవే! పంతులుగారూ! అగ్గిపెట్టె వుందా?

సీతా—లేదండీ; నాకు అలవాటు లేదు.

కొత్త.—(నవ్వి) నవ్వుటాలకంటున్నాను. కోప్పడకండి అలవాటే లేదూ- అంటే అగ్గిపెట్టె వుంచే అలవాటు లేదా- చుట్ట కాల్చే అలవాటుకూడా లేదా?

సీతా—(నవ్వి) గా.మం ..

కొత్త— అదృష్టవంతులు ; అయితే [illegible]
నేను వాకిలి దగ్గరగా కూర్చుని పొగ యిటు వదుల్తాను.
దానికి శాస్త్ర నా పొగ గిట్టదులెండి.

[భీమయ్య తిరిగివస్తాడు]

భీమ— లేదు బాబూ! అయ్యర్ హోటల్ తీసేసి దానీ దానితో లేచిపొయ్యాట్ట.

సీతా— చచ్చాంరా దేముడా! గుడివాడదాకా యిహ కాఫీ దొరకదు, కాబోలు.

భీమ— భ లేవోడివయ్యా - సీతారామయ్యా! కోరుకున్న పెళ్ళిచేసుకోకుండా 30 ఏళ్లు గడిపావ్, 2 గం॥లు కాఫీ లేకుండా గడపలేవ్ ?

(కొత్తాయనతో) బాబూ! సామానేమన్నా బండీలో పెట్టాలా?

కొత్త— ఈ వెధవస్టేషన్‌లో కూలీలుగూడాదొరుకుతారా!

భీమ— దొరకరు గానీయండీ, మీబోటి పెద్దారెవరన్నా కావాలంటే, నా చిన్న మనవడు కనిపెట్టుకుని వుంటాడు. ఏదో ఓ బీడీ ముక్కొస్తుందనీ.

సీతా— నేచెప్పలే! "అక్కడ సరిగ్గా ఎవ్వరూ దొరకరండీ సంచీ చెంబూ పుచ్చుకుపోదాం," అంటే విన్నారా! ఎక్కడ పడుకుంటామే అని హోల్డాలు, బట్టలనీ ఇందులో పెట్టవే అని పెట్టె కూడా పట్టుకొచ్చారు.

కొత్త— అబ్బబ్బ! వెధవది! ఒక్క పెట్టె కి Bed ఏమిటి? 10 పెట్టెలు 10 Bed లు మోసి బండిలో పారేద్దురూ నిన్ను వెంటబెట్టుకురాకపోతే. "మీరు మొయ్యలేరండీ, మీవల్ల కాదండీ," అని వకటే గావుకేకలాయె, వెనకనే. ఏం? డిప్యూటీకలెక్టర్నయినా రిటైరయ్యానుగా. మన పెట్టె మనబెడ్డూ మనం మోసుకుంటే తప్పా.

సీతమ్మ— (నవ్వి) ఆ మీరు రిటైరయితే అయ్యారేమో! నేనింకా ఎక్కడికి వెళ్ళినా డిప్యూటీ కలెక్టర్ గారి భార్యననే అంటారు.

సీతా— ఇంతకూ మీరు డిప్యూటీకలెక్టర్ గారా?

కొత్త— ఆ; ఆ; రిటైర్డ్ డిప్యూటీకలెక్టర్నిలెండి.

సీతా— పేరేమన్నారు?

కొత్త— "రాజయ్య పంతులం"టారు.

సీతా—అల్లాగా పేరు విన్నానుగానీ పరిచయంలేదు.

రాజ— ఆ-పేరు వినుకిడి కూడా అనుమానమేలెండి. నేనంతా శ్రీకాకుళంవైపే పనిచేసాను.

సీతా— అయితేనేం లెండి, పేరుబాగా విన్నదే.

రాజ— ఇంతకూ తమరూ?

సీతా— నా పేరు సీతారామయ్య. బెజవాడలో ప్లీడరుగా ప్రాక్టీసు చేస్తున్నాను.

రాజ— ఖర్మంజాలక రిటైరవలేదుగ?

సీతా— అవనిస్తే అవుదామనేగానీ ... ఆవనిస్తారా!

రాజ — బాగా వెనకేసినట్లున్నారు ప్లీడరుగారు, అవున్లెండీ, వయసువచ్చినకొద్దీ ప్లీడర్ల నాలుక వాడి ఎక్కుతుంది. గడించి పడేస్తారు. వయసువచ్చిన తర్వాత మా ఉద్యోగాల వాళ్ళకి – గడన లేదు– నోటికి గడియతప్పదు.

సీతమ్మ— అదేం నోటికి గడియ వేసుకోకపోతే గావు కేక పెట్టరాదూ ? వద్దన్న వారెవ్వరు ?

రాజ — అమ్మమ్మ ! ఎంతమాటన్నావ్ ! నీతో పాటు పోటీ చేసి నేనూ కేక వేస్తే ఇరుగూపొరుగూ యింకేమన్నా వుండా ? అసలే ఉబ్బసపురోగిని ?

సీతమ్మ— చాల్లెండి. నేర్చారు – అసలే కాఫీతాగక తల నొప్పివస్తుంటే.

రాజ— ఇక్కడ కాఫీ దొరకదు పుగాకెక్కడ కావాలన్నా అరమైల్ వెళ్ళాలి. ఆ మరచెంబు యిల్లాయియ్యి.

సీతమ్మ— ఎందుకూ ? పుగాకుదీంట్లో పెడ్తారా – వెధవ వాసన కొట్టటానికి ?

రాజ— కాదే! అందులో కాఫీకూడా పోయించుకొస్తాను. అసలే చిరాకు మనిషివి ;

[అంటూ వెళ్ళి చెంబుతీసుకుని, సీతారామయ్యదగ్గర కొచ్చి] ప్లీడరుగారూ కొట్టుదాకా నేనుమళ్ళీ వెళ్ళకుండా దీన్ని కనిపెట్టి వుండండేం– మీకూడా కాఫీ పట్టుకు వస్తాను.

సీతమ్మ— అదిగో ! అదే వద్దన్నది. ఎరామరిక లేకుండా ఏమిటా మాటలు ?

[అంతలో రాజయ్యనవ్వి వెళ్ళిపోతాడు. వెనకనే తనూ దర్వాజాదాకా వెళ్తా]

సీతమ్మ— ఇదిగో! ఆ మఫ్లర్ చెవులమీదకు లాక్కోండి. కోటు గుండీలు పెట్టుకోండి. ఇదిగో! మిమ్మల్నే! (వెనక్కివస్తూ) అబ్బెబ్బె వయసునచ్చిందన్న మాటేగాని చిన్నతనంపోలేదు.

సీ.రా— (నవ్వి) మీరు ఏవూరు వెళ్తున్నారు?

సీత— గుంటూరు వెళ్ళాలి. అక్కడ నాల్గురోజులుండి పెద్దకోడలు పురుడుపోసి, ఆ తర్వాత ఏలూరు వెళ్ళాలి.

సీ. రా— ఏలూరులోనే వుంటున్నారన్నమాట.

సీత— లేదండి. విజయనగరంలో వుంటున్నాం. ఏలూరులో మూడోకోడలప్పుటికి పురిటికోస్తుంది.

సీ. రా—అలాగా పిల్లలెంతమందన్నారు?

సీతమ్మ—అనాల్సివస్తే అయిదుగురు. కాని ముగ్గురేమిగిలారు తలాఒకవూళ్ళోవుండేటప్పటికి— వీరందరిచుట్టూ తిరగలేక ప్రాణంమీదికొస్తుంది. "పోనీ మీ రొక్కరో అక్కడవుండండి నేనుతిరిగివస్తానంటే వినరు. ఇక్కడ మావాళ్ళింట్లో పెళ్ళికివచ్చాం. నేవెళ్ళివస్తాలెండీ" అంటే వినకుండావచ్చారు. పోనీ యీపల్లెపట్లలో తిరిగినవారా అంటే— అదీలేదు. వచ్చినప్పట్నించీ నాకవస్థ, నాకంటె ఈ కాలనసీళ్ళా యీదురుగాలీ అలవాటు— చిన్నప్పట్నించీ వస్తూపోతూవుండేదాన్నగనక.

సీ. రా—అయితే మీరు యీప్రాంతంవారేనన్నమాట

సీత—అయ్యోరామా! ఈవైపువాళ్ళమే; ఇంతచిన్నప్ప టిన్నుంచీ యీవూరు వస్తూపోతూ, వుండేవాళ్ళం. పెళ్ళయిన తర్వాతేగా మానేశాం;

సీ. రా—అల్లాగా! నేనూ నాపెళ్ళయి ప్రాక్టీస్ పెట్టిన తర్వాతేగాని, అంతకుముందు వస్తూపోతూనేవుండేవాణ్ణి.

సీత—అల్లాగా మీపేరేమన్నారు?

సీ. రా—సీతారామయ్య.

సీత—అహ్హా! ఎక్కడో మిమ్మల్ని చూశినట్టేవుంది. అవును. అయ్యో నారాతా! 30 ఏళ్ళకిందటిమాట.

సీ. రా—మీపేరూ.....?

సీత—ఆ! సీతమ్మతల్లిని.

సీ. రా—నాకూ మొదట్నించీ అనుమానంగానే ఉంది. ఈవెధవచత్వారంగూడా, వచ్చిందేమో! అదేపోలిక. ఆవేళా యిల్లాగే గుమ్మందగ్గరనుంచున్నారు. మరే! మావాళ్ళూ మీవాళ్ళూ వెనకనేరాబట్టిగాని లేకపోతే, బంఢీవచ్చేదే,—ఎక్కివెళ్ళేవాళ్ళమే.

సీతమ్మ—ఆ రాత రాసిపెట్టి వుండద్దూ! ఉంటే యిట్లా గెందుకవుతుంది?

సీ.రా—ఎన్నికలలు కన్నాను? అన్నిటిలో, కొన్ని నిజమైనా చాలు. ఇంతకూ నువ్వూ— (నాలిక కరచుకుని) పొరపాటయింది నువనేశాను,

సీత—భగవంతు డనుగ్రహించటం తప్పిపోయిందిగాని అలా అనవల్సినవారేగా! ఏమిటో! అంతా మొన్న మొన్నలా కనిపిస్తోంది. ఆ వంగిన చెట్టూ— ఆ లాంతరు స్తంభం— అప్పటికి యీ రెండో లైను వెయ్యలేదు.

సీ. రా—ఆనాటి ఉద్రేకాలు వేరు; ఆ మనస్సులు వేరు— అప్పటి మనుష్యులుకూడా వేరేనేమో!

సీత—వేరే. వేరుకాకపోవడమేమిటి? ఏదో శాస్త్ర మన సుంచబట్టగలవాళ్ళం గనకగానీ లేకపోతే యీ జన్మలిట్లా గడిచేవా?

సీ. రా—ఏమో! నీ కెట్లాగుందోగాని నేను రెండుసార్లన్నా ఆత్మహత్యకు ఆలోచించాను.

సీత—అయ్యో రామా! రెండుమార్లు నూతిలోకి గెంతేస్తే— గడలేసి తీశారు. "ఆ నూతిలో ఏముం దే? మాటమాట్లాడితే, అక్కడకెళ్ళి కూర్చుంటావూ?" అనే వారీయన చాలారోజులవరకూ, కాసేపు యింట్లో ఎక్కడా కనిపించకపోతే, సరి— యీాయన వెళ్ళి నూతిలో వెతికేవారు.

సీ. రా—నీకు జ్ఞాపకం వుందా? ఆరోజుల్లో యిద్దరం మాట్లాడ్తూకూర్చుంటే భోజనాలుకూడా మర్చిపొయ్యేవాళ్ళం.

సీత—నిద్దర్లు మాత్రం వుండేవా ఏమిటి? ఎదటకూర్చుంటే నిద్దరే లేదు. ఎదట లేకపోతే నిద్దరే పట్టదు.

సీ. రా—విడచి వున్నప్పుడు విచారం. విడవకుండా వుండిపోతే మమకారం— పెరిగిపోతూ వుండేవి.

సీత—బాగా అలవాటయిపోయిన తర్వాత గూడా పొర టున ఎప్పుడన్నా—మీరు "సీతా" అని పిలిస్తే ఒళ్ళు జలదరించేది.

సీ.రా—వినలేక వింటూ ఎనుగెత్తి—చివరకి మూఆయన కాలి గజ్జల పట్టాలు తీసిపారేయించాను. మనసుపడి నువ్వు పెట్టుకోనేలాంటి పట్టాలు కొన్నాను. ఆ చప్పుడే మనసును బాధపెట్టేది.

సీత—ఎప్పుడూ లేంది—వారు నల్లకోటు వేసుకుంటే అట్టు చూడ బుద్ధిపుట్టేది. సుఖంగా వున్నా కష్టంగానూ, ఆ కష్టంలోనే ఏదో సుఖంగానూ వుండేది. ఏదో అయిపోయినై 30 ఏళ్లు.

సీ.రా—ఆ చెరువుదగ్గర నువ్వు చేం చేసే చిలిపి చేష్టలు చెపితే చెల్లవ్. జ్ఞాపకముందా? ఓరోజున చెరువులోదిగి నేను స్నానం చేస్తుంటే కలువపువ్వులందుకో పోయినువ్వు కాలుజారి పడ్డావు.

సీతమ్మ— మరే, పరధ్యానంలో కాలెక్కడేసిందీ కనపడలేదు.

సీ. రా— గుళ్లో మొండిగోడవెనక దాక్కుని దడిపించి నప్పుడు, మరోగమ్మత్తు.

సీత— ఆ, ఆ, దడిపి స్తేదడుసుకోరేం? దడుసుకున్నా మీరావ పడిపోలేదుగా.

సీ. రా— (నవ్వి) ఏమిటో! ఎప్పుడూ మనసులో అదే చింత- అందులోనే కొంత సంతోషం వుంది కాబోలు. ఇంతకూ జీవితాలు ఎల్లా తెల్లవారి పోయినాయి, కష్టమో నిష్ఠూరమో కాని కాలం వెళ్ళిపోయింది. పిల్లలూ పెద్దవాళ్లయి వాళ్లదోవ వాళ్లు చూసుకుంటున్నారు, ఫర్వాలేదు మనం కృతకృత్యులమైనట్టే.

సీత— అయితే ప్లీడరుగారు బాగా సంపాదించి పడేసినట్లున్నారు.

సీ. రా— ఆ- సంపాదనేముందిలే; దాని బాపతు ఆస్తి కిల్సినప్పుంది. నేనా ఆస్తిని వదిలించలేదు అంతే-అదే- ఓ పతిక ఎకరాలయింది.

సీత.— అయితే మీ ఆవిడ ఆస్తితో కూడా వచ్చిందన్నమాట?

సీ. రా— ఆ! పదెకరాలు వచ్చింది.

సీత— నయం కాదూ? నాకు మల్లేగాకుండా

సీ. రా— నయమంటే - ఎక్కడికలే?

సీత— నయమేమరి మమ్మల్ని చూడరాదూ, ఉద్యోగాల వ్యామోహమేగాని, దమ్మిడీ నిల్వలేదు. ఆయనకేమో ఉబ్బసం. నారాత కష్టాలు పడ్డామో లేదోగాని ఇప్పటికూడా సుఖంలేదుగా?

సీ. రా—నేనూ అంతేకాని ఓసంగతి బ్రతుకంతా అయిపోయింతర్వాత. కష్టమో సుఖమో, తేల్చుకోలేని పరిస్థితుల్లో వున్నప్పుడు మనం బాగా బ్రతికామన్న మాటేరి

సీత___బాగా అలవాటయిపోయిన తర్వాత కూడా వారు టున ఎప్పుడన్నా—మీరు "సీతా" అని పిలిస్తే వళ్ళు జలద రించేది.

సీ.రా___విన లేక వింటూ విసుగెత్తి—చివరకి మా ఆవిడ కాలి గజ్జల పట్టాలు తీసి పారేయించాను. మనసుపడి నువ్వు పెట్టుకోనేలాంటి పట్టాలు కొన్నాను. ఆ చప్పుడే మన సును బాధపెట్టేది.

సీత___ఎప్పుడూ లేంది—వారు నల్లకోటు వేసుకుంటే అలా చూడ ఇబ్బందిపుట్టేది. సుఖంగా వున్నా కష్టంగానూ, ఆ కష్టంలోనే ఏదో సుఖంగానూ వుండేది. ఏదో అయి పోయినై 30 ఏళ్లు.

సీ.రా___ఆ చెరువుదగ్గిర నువ్వు చేసే చిలిపి చేష్టలు చెపితే చెల్లవ్. జ్ఞాపకముందా? ఓరోజున చెరువులోదిగి నేను స్నానం చేస్తుంటే కలువపువ్వులందుకో పోయినువ్వు కాలుజారి పడ్డావు.

సీతమ్మ___మర్చే, పరధ్యానంలో కాలెక్కడేసిందీ కనపడ లేదు.

సీ. రా___గుళ్లో మొండిగోడ వెనక దాక్కుని దడిపించి నప్పుడు, మరోగమ్మత్తు.

సీత___ఆ, ఆ, దడిపి స్తేదడుసుకోరేం? దడుసుకున్నా మీరు పడిపోలేముగా.

సీ. రా— (నవ్వి) ఏమిటో! ఎప్పుడూ మనసులో అదే చింత- అంతలోనే కొంత సంతోషముందికాబోలు. ఇంతకూ జీవితాలు ఎల్లా తెల్లవారి పోయినాయి, కష్టమో నిష్ఠూరమో కాని కాలం వెళ్ళిపోయింది. పిల్లలూ పెద్దవాళ్ళయి వాళ్ళదోవ వాళ్ళు చూసుకుంటున్నారు, ఫర్వాలేదు మనం కృతకృత్యులమైనట్టే.

సీత— అయితే పిల్లడరుగారు బాగా సంపాదించి పడేసినట్లున్నారు.

సీ. రా— ఆ- సంపాదనేముందిలే; దాని బాపతు ఆస్తి కల్సివచ్చింది. నేనా ఆస్తిని కదిలించలేదు అంతే-అదే- ఓ ప్రతిక ఎకరాలయింది.

సీత— అయితే మీ ఆవిడ ఆస్తితో కూడా వచ్చిందన్న మాట?

సీ. రా— ఆ! పదెకరాలు వచ్చింది.

సీత— నయంకాదూ? నాకు మల్లేగాకుండా

సీ. రా— నయమంటే - ఎక్కడికిలే?

సీత— నయమేమరి మమ్మల్ని చూడరాదూ, ఉద్యోగాల వ్యామోహమేగాని, దమ్మిడీ నిల్వలేదు. ఆయనకేమో ఉబ్బసం. నారాత కష్టాలు పడ్డామో లేవోగాని ఇప్పటిక్కూడా సుఖంలేదుగా?

సీ. రా—నేనూ అంతేకాని ఓసంగతి బ్రతుకంతా అయిపోయింతర్వాత. కష్టమో సుఖమో, తేల్చుకోలేని పరిస్థితుల్లో వున్నామిప్పుడు మనం బాగా బ్రతికాయున్నమాటేరి

నేనప్పుడప్పుడూ అనుకుంటూవుంటా. ఒకవేళ మనకొక్కే అయివుంటే నేనుగూడా వెనకేమీలేని ప్లీడర్లలాగ "పిట్టనుగొట్టా-పొయిలోపెట్టా" అన్నట్లు బ్రతకాల్సిన వాణ్ణేగదాఅని.

సీత—నేనూ అనుకునేదాన్ని- విజయనగరంలో వుండగా, "ఆపనిచేసిపెట్టమ"ని,—"ఈపనిచేసిపెట్టమ"ని, మావారి దగ్గరికి ప్రతిరోజూ ఎవరోప్లీడర్లు వస్తూపోతూవుండేవాళ్లు. వాళ్ళెపర్నన్నా చూడంగానే "మనపెళ్ళయివుంటే మాఅయనకూడా యిట్లాగే తిరగాల్సినవాడేగదా" అని

సీ.రా— ఏమిటో! మనసుసరిపుచ్చుకుంటే అంతాసుఖం. సరిపుచ్చుకోకపోతే, అంతాకష్టం.

సీత—అని యీనాడు తెల్సింది ఆనాడు తెలియదుగా అవయసులో అదిసహజమే. ఈ Plat Form మీదేగా "నేనింటికి రానంటేరానని, ఆవేళ, అంతగోలచేశాం. మీరు మరీని! ఆ లాంతరు స్తంభానికి ఏకంగాతల "ఫెడఫెడీ" కొట్టుకున్నారు.

[అంతలో 16 ఏళ్ళయువతి ఆమెవెనకనే 20 ఏళ్ళ యువకుడు గబగబా ప్రవేశిస్తారు.]

యువకు—నామాటవిను; ఇట్లాపడి స్తే ఎట్లా?

యువతి—కాని ఏమిటో నాకుభయంగావుంది.

యువకు—నాకుమాత్రంలేదూభయం.

యువతి—నీ సంగతి వేరు, మగవాడివి; నీకెట్లాగైనా ఫర్వాలేదు.

యువ—అయితే సరే, ఇక నేనేం చెయ్యను? కానియ్యి. నువ్వింటికి వెళ్ళు ఇక.

యువతి—నువ్వో—?

యువ—నా సంగతి నాది; డొంవలో చాలా కాలవలున్నాయి ఇక్కడే చాలా చెట్లూ లాంతరు స్తంభాలూ వున్నాయి.

యువతి—అదేం పని—?

యువ—అంతకంటే వేరేం పనుంది. అన్నింటిలో అదే తేలిక పని.

యువతి—అటువంటి పనిచేయకు- నీకు పుణ్యముంటుంది.

యువ—పుణ్యంలేదు- పాపం లేదు; నీ కిష్టంలేకపోతే చెప్పు. ఇప్పుడే యిక్కడే యీ తలుపుకేసి తల బ్రద్దలుకొట్టు కుంటాను.

యువతి—అయ్యయ్యో! నన్నేం చేయమంటావ్ చెప్పు? మా అమ్మా నాన్న అట్లా అన్నారు నువ్వేమో యిట్లా అన్నిటికంటె హాయి- నెమ్మదిగా నేనే ఏ నుయ్యో- గొయ్యో చూసుకుంటే సరిపోతుంది.

యువ—ఇక అదే మిగిలింది. ఇద్దరం ప్రాణాలొదలటంలో యిద్దరికీ సుఖంలేదు. నామాట విను. ఈ బండికి ఎకు గున్నవాళ్ళెవరూ రాలేదు. నువ్విక్కడే వుండు- బండి రాంగానే ఎక్కు. అన్నింటికీ నేనున్నాను.

యువతి—ఒద్దు.

యువ — ఒద్దూ గిద్దూ ఏంలేదు. ఇక్కడే వుండు.

[వెళ్ళిపోతాడు. యువతి దుఃఖిస్తూ కూర్చుంటుంది. సీతారామయ్య— సీతమ్మ మొహా మొహాలు చూసుకుంటారు]

సీత— ఏవూరమ్మా మీది ?

(యువతి మాట్లాడదు, సీతమ్మ సీతారామయ్య నవ్వుకుంటారు)

సీ॥రా—ఏ సీతో! రుక్మిణో! అయివుంటుంది.

యువ—(ఖంగారుగా) ఆ! మీకెలా తెలుసు నాపేరు ?

సీ॥రా—నీ పేరూ నువ్వూకూడా నాకు తెలియదమ్మా ఖంగారుపడకు; మీ మాటలు విని, "అలాంటిదే ఏదో ఒక పేరు" అనుకున్నాను. ఇంతికూ నీపేరు సీతేనా?

యువ— కాదు రుక్మిణి.

సీత—మీవాళ్ళ కిష్టం లేకుండా యిక్కడి కెందుకువచ్చావ్.

రుక్మి—నాకిష్టం వుండి.

సీ॥రా—ఇష్టం వుంటే అతనితో వెళ్ళక ఏడుస్తున్నావేం?

రుక్మి—మావాళ్ల కిష్టంలేదుగనక—

సీ॥రా—బాగానేవుంది.

రుక్మి—మీరెవరో మంచివారిలాగున్నారు. పెద్ద దంపతులు మీరు చెప్పండి? ప్రేమించినవాణ్ణి పెళ్ళి చేసుకోవటం సుఖమా! ఎవర్ని చేసుకున్నా ఫరవాలేదా?

సీ॥రా—చంపేశావ్; చెప్పటం కష్టమేనే!!

రుక్మి—ఏం ?

సీ॥రా— మేమిద్దరిం.........

రుక్మి—ఆ- మీరిద్దరూ—— —?

సీ॥రా—ఆ! అదే! పెళ్ళి చేసుకోలేదు.

రుక్మి—పెళ్ళిచేసుకోలేదా! పెళ్ళిచేసుకోకుండానే యున్నా ఛ్ఛా, .........మీ అమ్మా - నాన్నా - చుట్టాలూ - పక్కాలూ ఒప్పుకున్నారా?

సీత—లేదమ్మా! వారువేరూ- నేనువేరూ (శ్రీ) కాకుళంలో మావారు డిప్యూటీకలెక్టర్ గావుండేవారు.

సీ. రా—మరే; నేను బెజవాడలో ప్లీడర్ని.

రుక్మి—అల్లాగాఅండి. ఒంటరిగా యిద్దరూవుంటే - పొర పాటు-పడ్డాను. మరేంఅనుకోకండి.

సీ. రా—అమ్మాయ్! పెద్దవాణ్ణి - అడుగుతున్నాను. - మరేమీఅనుకోకుగాని-నీకతనంటే బాగాయిష్టమేనా?

రుక్మి—ఆ బాగానే.

సీ. రా—మరింకేం? అతనితో వెళ్ళి-పెళ్ళిచేసుకో.

రుక్మి—పెళ్ళిచేసుకోవాలనే- కాని అతనికి వెనకాముందూ ఏంలేదు. ఉద్యోగమూలేదు. పెళ్ళిచేసుకుంటాం తర్వాత గాని వస్తులుండటంఎల్లా?

సీత—మరామాట అతని కెందుకుతోచదు?

సీ. రా—ఆమాట ఆవయసులో ఎవ్వరికితోచదేమొ!

సీత—ఆమాటనిజమే. కాని తోస్త్రీతోందరపడకుండావుంటా రుగా! మీామట్టుకుమీారు - జరిగినపెళ్ళికి సంతోషించ కుండా వున్నారా?

సీ. రా — సంతోషిస్తూనేవున్నా. కాని జరగని పెళ్ళిసంగతి మర్చిపోనూ లేదుగా?

రుక్మి—మీసంగతులన్నీ తర్వాత తేల్చుకుందురుగాని. పెద్దవారూ—"మాఅమ్మా నాన్నా" లాగున్నారు. నాసంగతేమిటి? వెళ్ళమంటారా? వద్దంటారా? తొందరగా చెప్పండి.

సీ. రా—తొందరగా అంటే ఎల్లా, నాకు30ఏళ్ళు ఆలోచించినా యీసంగతి తేలలేదు.

రుక్మి—వేళాకోళంగాదండీ. చెప్పండి.

సీత—నీకిష్టమైందేదో అదిచెయ్యమ్మా ఇదిఒకరు చెప్పేది కాదు.

రుక్మి—నాకేదీ తేలటంలేదు. అతన్నిచూస్తే వెళ్ళాలనిపిస్తోంది.

సీత—అయితే యింటికివెళ్ళు. అదేబాగుండేట్టువుంది.

సీ. రా—బాగా నేవుండవచ్చు—వుండకపోవచ్చు. కానిజ్ఞాపకం వచ్చినప్పుడల్లా యీ సంఘట్టన మనసులో కలక వెయ్యక తప్పదు. నేనీరోజుకి మర్చిపోలేదు— 30ఏళ్ళయినా?

సీత—నేనూమర్చిపోలేదు కాని—!!

రుక్మి—మళ్ళీ మీసంగతి మొదలెట్టారు. కాస్తనాసంగతి ఆలోచించండి.

సీత—సినిమాకెళ్తేనమ్మా – మాట్లాడేది. వస్తేకాస్త జ్ఞాపకం వస్తుంది. అంతేగా.! మళ్ళీ ఏపిల్లాడో ఏడుపు మొదలెడితే మర్చిపోతాం. అంతే.

సీ. రా—ఏమోనబ్బా! నాకు ఏ"లా" LAW పుస్తకం ముందరేసుకున్నా సరే- మరుపువచ్చేదికాదు.

రుక్మి—అంతకష్టమంటారా మర్చిపోవటం ?

సీత—కష్టమేముందీ ? ఏదాసీదానిమీదో రెండు కేకలేస్తే- అప్పుడే మర్చిపోతాం.

రుక్మి—అంత తేలికంటూారా మర్చిపోవటం ?

సీ. రా—అయితే-మీ ఆయనన్నట్లు – నువ్వుమాటమాట్లాడితే చిర్రుబుర్రులాడేది- యిదిమర్చిపోవటానికన్నమాట.

సీత—మీరు "లా" పుస్తకాలే ఎప్పుడూ చూశేది ఇందుకేనా ఏమిటి ?

రుక్మి—అబ్బబ్బ ! మీ సంగతి నెమ్మదిగా ఆలోచించండి. నా సంగతి వదిలేస్తారేం మాటమాట్లాడితే!

సీత—ఇంటికే వెళ్ళమ్మా. తర్వాత ఎట్లా జరగాలో అట్లా జరుగుతుంది.

రుక్మి— వెళ్లమంటారా ? అయితే వెళ్ళిపోతాను, (వాకిలిదాకా వెళ్ళి) అబ్బ ! ఎట్లా వెళ్లనండీ! అతన్నట్లా ఫ్లాట్ఫారంమీద చూస్తూ.

సీ. రా—నేనూ అట్లాగే తిరిగాను ప్లాట్ ఫారంపూరాద.

సీత—"నేనూ యిట్లాగే తిరిగాను" గదిలో.

రుక్మి—అబ్బబ్బ! మళ్ళీ మీా సంగతేనా?

సీ. రా—లేదుగానీ- అతను నిన్ను గట్టిగా ప్రేమించాడని నమ్మకమేనా?

రుక్మి—ఆ; నమ్మకమే. భాగవతం పుచ్చుకొని ప్రమాణం చేశాడు; పెళ్ళి చేసుకోకపోతే బ్రతకనని. ప్రతిజ్ఞలుకూడా చేశాడు.

సీత—అలా అందరూ చేస్తారు. అంతకన్నా ఏమన్నా...

రుక్మి—అల్లా అందరూ చేస్తారా?

సీత—చేస్తారో లేదో ఆయన్నడుగు.

సీ. రా—చేస్తారు; చెయ్యటంలో గూడా నిజాయితీగానే చేస్తారు, కానీ- నిజంగా ప్రాణాలొదలాలంటే కష్టంగానే వుంటుంది.

రుక్మి—అయితే ఆత్మహత్యల భయం వుండదనేనా?

సీత—ఆఁ వుండదు. ఆ భయమేమీా అక్కర్లేదు

రుక్మి—అయితే ఫర్వాలేదు; నేనింటికి వెళ్తా—వెళ్ళమంటారా? అతనక్కడేవున్నాడే...!!

[భీమయ్య వస్తాడు]

సీ. రా—రా-భీమయ్యా. మళ్ళా 30 ఏళ్ళతర్వాత మళ్ళా వకసారినువ్వు సీతారామయ్యలకథ చూస్తున్నావిక్కడ.

చూడుమా! ఈఅమ్మాయి, ఆ అబ్బాయిన్ప్రేమించి వెంట వెళ్ళిపోతోంది.

భీమ—అల్లాగా !! చక్కనిజంట, వెళ్ళమ్మా - బండీరాంగానే వెళ్ళు.

రుక్మి—వెళ్ళమంటావా,?

భీమ—మరి వెళ్ళమన్నా ! 30 ఏళ్ళక్రిందట యిక్కడే చూశా ఒకసీతారామయ్య- ఒకసీతమ్మను, తీసుకొచ్చాడు-బండికి వెళ్ళాలనే, కాని బంధువులొచ్చి విడదీసుకుపోయారు. వాళ్ళారాం చూశామేము ! మాముసల్దీ-నేనూ యిప్పటికీ తల్చుకుని కన్నీళ్ళు పెట్టుకుంటాం- ఎందుకొచ్చినకన్నీళ్ళు- అందుకనే నాకిట్టా ఎవరుకంటబడినా- వెంటనే ఎళ్ళంపంటా,

రుక్మ—కాదు తాతా! అల్లావెళితే-తర్వాత యిబ్బందిపడం.

భీమ—ఇబ్బం దేముందీ ? ఒకరికష్టం - ఒకరు- ఒకరిసుఖం ఒకరు పడటానికేగా -ఎళ్ళేది ? ఇకేంయిబ్బంది—?

సీ. రా—అదే నే ననేదీసీ. కనకనే నేనూ వెళ్ళమంటాను.

సీత—అందుకనేనేననేదీ. కనకనే వెళ్ళవద్దంటా. "కష్టమో సుఖమో" ఏదొస్తే అదే, పడేకాడికి-ప్రేమించినవాణ్ణె పెళ్ళిచేసుకోవాలా ఏమిటి ? "ప్రేమించినవాడ"ంటే- గట్టిగాసుఖపెట్టేవాడు. అందుకనే అమ్మాయ్-నేచెప్తే

న్నాని, తనూపస్తు పడుకని, సీతకు పెట్టేవాడవైతే వెళ్ళు. లేకపోతేనష్టు.

భీమ—అయితేమామ్మసిల్లి తనుపస్తు పడుకునే నాకు పెట్టుద్దే!

సీ. రా—మరినువ్వో—?

భీమ—నాకూఅట్టానేవుంటుంది. అందుకని చెరిసగంతిని, తొంగునేవోళం-అప్పట్లో.

సీ. రా—అయితే. 30ఏళ్ళక్రింద నేనేంబుద్ధితక్కువపని చెయ్య లేదని తేలిపోయింది.

సీత— అవును. బుద్ధితక్కువపని ఎవ్వరూచెయ్యలేదు. కనకనే కంటతడితోనన్నా యిలాకాలక్షేపంచెయ్యగలిగాం.

రుక్మి—అయ్యయ్యో! మళ్ళామీరేసంగతో మాట్లాడు తున్నారు......

[బయటనించి రాజయ్యపంతులు మరచెంబుతోసహా వస్తాడు]

రాజ—కాఫీ తెచ్చాను-తాగు. నే నాబయటకూర్చుని నా పొగాకు నేకాల్చుకుంటాను. (సీతారామయ్యవంక చూసి) నాపొగ దానికి గిట్టదులెండి.

సీత— చాల్లెద్దురూ-గోల, పొగభాడన్నాగిట్టకుండా 30 ఏళ్ళు కాపరంచేశానా?

రాజ——నే ననేది చుట్టపోగసంగతే. ఇకనాపొడసంగతా? గిడితే అలాఖుస్సుబుస్సులాడాల్సిన ఖర్మేంపట్టింది? "ప్రేమ అను రాగాలు" లేవని నేననటంలేదు. దాంట్లోనే-కాస్త దూరం ప్రేమ- దగ్గర ప్రేమ- మరీమీాదపడిపొయ్యే ప్రేమా వుంటాయిగా? (అందరూనవ్వుతారు) నువ్వు కాస్తకాఫీతాగి ఆలోచించు-నీకేతట్టుతుంది. పెళ్ళయిన మొదట్లో నువ్వు ఎట్లావుండేదానివి.

సీత——మొదట్లోఅంటే అవివేరు. అప్పటిసంగతి మీాకేం తెలుస్తుంది.

రాజ——నాకు తెలియకేం? బాగా తెల్సు-ఇద్దరు పిల్లలుపుట్టే దాకా దీనిసంగతి వర్ణనాతీతమండి – ప్లీడరుగారూ, తర్వాత-తర్వాత- అలవాటైపోయి, కాస్తయిటుపోగ అటువచ్చినా, పూరుకుంటున్నది.

సీత——చాల్లెండి చెప్పొచ్చారు. అమ్మాయీా! నీకంతగా అతన్నే పెళ్ళిచేసుకోవాలనుంటే వెళ్ళమ్మా. మేమేదో పూరికేఅన్నాం.

భీమ——అంత తేలిగ్గావప్పుకున్నారే అమ్మగారు.

రాజ——ఇదేంకథా?

సీత——ఇదొక పొడుపుకథ.

సీ. రా——కాని పొట్టిదికాదు. ఈ అమ్మాయి ఓఅబ్బాయిని ప్రేమించి-ఇంట్లోవాళ్ళకి యిష్టంలేకపోయినా, లేచివెళ్తు

న్నది, "అదితనకు మంచిదా కాదా" అనిసమస్యలోపడింది! ఇంతవరకూ మీభార్యగారు వద్దన్నది. ఇప్పుడు వెళ్ళమంటోంది.

రాజ— ఓ! ఇంతేకదా !!

సీ. రా— అలా తేల్చివేయకండి; ఇది చాల క్లిష్టమైన సమస్య. నామట్టుకునాకు 30 ఏళ్ళనించీ తేలలేదు.

రాజ— నే తేలిగ్గానే తేల్చివేస్తాను. అమ్మాయ్! ఇట్లారా! మీవాళ్ళకి యీపెళ్ళి యిష్టంలేదా ?

రుక్మి— లేదు.

రాజ— నీకు బాగా ఇష్టమేనా ?

రుక్మి— ఆ.

రాజ— సరే. అతనికి బాగా యిష్టంలేకపోయినా ఫర్వాలేదులే; ఇక నువ్వు ... ... ... !

సీ. రా— అట్లా అంటారేం ? ఆతని కిష్టంలేకపోతే ఎట్లా ?

రాజ— ఎట్లాగేముందీ! ఈ అమ్మాయికి యింత యిష్టం వుంటే అతనుమాత్రం ఎన్నాళ్ళు వూరుకుంటాడు; చూడమ్మాయ్! నువ్వు ఒక పనిచెయ్యి. వెంటనే అతనితో వెళ్ళి – పెళ్ళిచేసుకో. ఈలోపుగా మీవాళ్ళు ఖంగారుపడ్తారు. మూణ్ణిద్రలుచేసి యింటికి చక్కారండి. చూశావ్! ఎన్నాళ్ళని యిష్టంలేనిఅల్లుణ్ణి మీవాళ్ళు

యింట్లో పెట్టుకుంటూరు ; యిష్టపడి తొందరగానే అత నితో నిన్ను పంపించేస్తారు.

సీత— అయితే 30 ఏళ్ళతర్వాత అడుగుతున్నాను. నేనంటే మీకు యిష్టంలేదన్నమాటేగా.

రాజ— 30 ఏళ్ళ తర్వాత - ఇష్టాయిష్టాలసంగతి యిప్పు డెందుకే - పిచ్చినానా!

[యువకుడు గబగబా దర్వాజా దగ్గరకొచ్చి]

యువ— ఆ. ఆ. బండి వస్తోంది రుక్మిణీ! తొందరగా ఆ ముందుపెట్టెలో ఎక్కుదాం, రా.

భీమ— బండి వస్తూనే వున్నట్టుంది, బాబూ! మా మనవణ్ణి పిలవమంటూరా?

రాజ— ఎందుకు. నేనే మోస్తాలే యివ్వేక లెక్కా?

రుక్మి— అయితే వెళ్ళమంటూరా పిన్నిగారూ?

సీత— ఎందుకు నాతో రాఅమ్మా. మీపెళ్ళి నాయింట్లోనే చేస్తాను. లేకపోతే మళ్ళా అనుమానంలోపడి అన్ని విధాలా చెడతావ్. మనసులో కలతవున్న బ్రతుకు బాధ- నాకూ తెలుసు.

[రుక్మిణీ - యువకుడు, రాజయ్య సీతమ్మ పెట్టెలతోసహా వెళ్తారు]

భీమ— ఏమిటండీ.? ఈఅమ్మ యింతవరకూ అల్లా మొరా యించి, యింతలో ఇలా మారిపోయింది.

సీ. రా— హూఁ. అరవకు. ఆమే, – ఆనాటి సీతమ్మతల్లి.

భీమ—ఈమే సీతమ్మతల్లా–ఓరి! ఓరి! మా ముసిల్దిచూస్తే ఏమనేదో.

సీ. రా— ఆమే వేరేపెళ్ళిచేసుకుని–ముగ్గురు పిల్లల్నికన్నది. అయినా మనస్సులో ఇన్నాళ్ళూ బాధపడింది. కనకనే వీళ్ళపెళ్ళి కొప్పుకుంది.

భీమ— 30 ఏళ్ళూ ఈ బాధే!!

సీ. రా—ఆ. ఈ బాధే, – నాబాధే, వస్తా రైలు వస్తోంది. (వెళతాడు)

భీమ— అయితే తెగబడి లేచొచ్చినా – నేనూ మా ముసిల్దే నయమన్నమాట.

[తెల్లబోయి నుంచుని వుంటాడు]

—: తె ర :—

పాత్రలు:—

1. ప్రభు — యువకుడు. కాబోయే పెళ్ళికొడుకు
2. శర్మ — పెళ్ళిపెద్ద
3. మధు — విమలఅన్న
4. మనోరమ — మధుభార్య
5. విమల — B. A. చదివిన యువతి
6. ఒకప్రభు — బాల్యస్నేహితుడు

# స్వయంవరం

ఏకాంకిక

[ఒక ధనవంతుని గృహం. మధ్య సావిడి. చక్కగా అలంకరించివుంది. మధ్యలో చక్కని తివాసీ దానిచుట్టూ సోఫాలూ ఉన్నాయి. ఒక ప్రక్కగా రేడియో ఒకటి చిన్న బల్ల మీాదవుంది.

తెర ఎత్తేసరికి 'మనోరమ' ఊలుతో ఏదో అల్లుతూంది. విమల రేడియో ట్యూను చెయ్యటానికి ప్రయత్నిస్తోంది.]

మనో—అబ్బబ్బ! మళ్ళీ ఆ రేడియో పెడ్తావెందుకు. తలనొప్పి?

విమ—తలనొప్పా! అయితే 'విజయవాడ' పెడ్తానాగు.

మనో—అబ్బబ్బ! అదితక్కువతలనొప్పా!!

విమ—కాదు. ఎక్కువతలనొప్పి.

మనో—ఏమోనమ్మా! ఎంతఆడబిడ్డవైనా రేడియో పెట్టి తలనొప్పిపుట్టించటం బాగుండలేదు.

విమ—మరినాకు వేరేంపనిలేకుండా నువ్వు లేసులుఅల్లుకుంటూ కూర్చుండటం బాగుందేం?

మనో—నీతో నేనువాదించలేను గాని, కావాలంటే నీ రేడియో నువ్వు పెట్టుకో.

విమ— ఏం! ఇల్లాలే! నిష్ఠూరంగా మాట్లాడితే ఏం చేస్తాననుకున్నావా? (రేడియో విజయవాడకు ట్యూన్ చేస్తూ) విజయవాడలో ఏదోనాటకంవస్తుందిప్పుడు......ఆ... "విజయవాడ-ఆకాశవాణీ"...పలుకమ్మాపలుకు.

[వాల్యూమ్ హెచ్చిస్తుంది]

రేడియో :— విజయవాడ – ఆకాశవాణి ...... మీరిప్పుడు "పెళ్లి చూపులు" అనేనాటకం వింటారు రచన- శ్రీ రమ్యశ్రీ – నటవర్గం – రంగారావు రామారావు – రామేశ్వరరావు – కామేశ్వరరావు ... ...

[విమల రేడియో ఆపుచేసివచ్చి కూర్చుంటుంది]

మనో— ఏం రేడియో ఆపేశావేం?

విమ— ఆ- ఏం లేదు.

మనో— అహా! "పెళ్లి చూపులు" నాటిక వస్తోంది. రమ్యశ్రీ రచన – మహారమ్యంగా వుంటుంది.

విమ— ఏడిచింది. వెధవనాటకాలు. "పెళ్లి చూపులు – మల్లి చావులు"

మనో— ఎందుకమ్మా, పెళ్ళిచూపులంటే అంతకోపం పెళ్ళి కావాల్సిన పిల్లవు?

విమ— కోపంగాదూ? నిన్ను కూర్చోపెడితే తెలుస్తుంది కోపం వస్తుందో రాదో.

మనో— అయితే నేను కూర్చోలేదంటావా ఏం? కూర్చున్నాను ఎట్లా కూర్చున్నాననుకున్నావ్? ఇట్లా? [తల

పం మెకు కూర్చుంటుండి] చదువుకున్న దానివిగనక నువ్వా యితే ఇంత తలవంచుకు కూర్చోనక్కర్లేకు లే

విమ— ఏం ఖర్మ! తలవం చుకోటానికి? నేనైతేనా —!

మనో— ఏం చేస్తావేం ?

విమ— ఏం చేస్తానా ? ఆ పెళ్ళికొడుకు సంగతేమిటో అంతు తేలుస్తాను. లేకపోతేనూ; వెధవఆచారాలూ, చాదస్తాలూ, పరీక్షలూను.

మనో— ఏమొ! ఏం చేస్తావో! త్వరలోనే రాబోతున్నాయిగా! అన్నీ అప్పుడే చూపిద్దూగాని.

విమ— ఇదిగో ఒదినా! ఇప్పుడేచెప్తున్నాను. అన్నయ్యతో నువ్వు చెప్పు. ఈ పరీక్షలకితలవంచి నేనుకూర్చునేది లేదు.

మనో— ఏం ? మీా అన్నయ్యతో నేనెందుకు చెప్పాలి? నువ్వే కావాలంటే చెప్పుకో.

విమ— నువ్వు చెప్పకపోతే నేనే చెప్తాను; భయమూ ఏం? మనదగ్గర ఈపప్పులేం ఉడకవ్ – పెళ్ళికొడుకురానీ, – వాడి బాబురానీ.

మనో— ఇద్దరూ వస్తార్లే, ఇవ్వాళో–రేపో మొన్న వచ్చిన ఉత్తరం నిజమయితే యివ్వాళే ...

విమ— ఏ ఉత్తరం ?

మనో— మొన్న వచ్చిందే!

విమ— ఏమని ?

మనో— చూసిపోవటానికి వస్తున్నారని.

విమ— ఎప్పుడూ ?

మనో— ఇవ్వాళ సాయంకాలానికే.

విమ— అందుకా అన్నయ్య స్టేషన్‌కి వెళ్ళింది !!

మనో— అందుకే.

విమ— అందుకా నీ గొలుసుకూడా నన్నే వేసుకోమన్నది ?

మనో — అందుకే.

విమ — అందుకా ఈ చీరకట్టుకో ఆపూలు పెట్టుకో ఈసెంటు పూసుకో, ఆపౌడరు రాసుకోమన్నది.

మనో— సరిగ్గా అందుకే.

విమ — ఇదిగో ఒదినా ... ఇప్పుడే చెప్తున్నాను — — నేను మాత్రం ... ...

మనో— నాకేమీ చెప్పొద్దు అన్నీ మీ అన్నయ్యతో చెప్పు.

విమల:—ముందు నీకు చెప్తాను. తర్వాతఅన్నయ్యకు చెప్తాను. నన్నుగంగిరెద్దులాగ వెళ్ళికూర్చోమంటే ఎల్లాగోఅల్లా తలవంచుకు కూర్చుంటాను. అంతేగాని ఏంచదివావు ? సంగీతం పాడతావా ? బాగానడవగలవా ? నాట్యంచేయ గలవా ? అని చొప్పదంటుప్రశ్నల నడిగితేమాత్రం వూరుకోను..

మనో —వాళ్ళడిగేటప్పుడు మేమేంచెయ్యం ?

విమ —ఏంచేసినాసరే ! చూడమను–వెళ్ళమను. మాట మాట్లాడితేమాత్రం ఊరుకోను.

మనో—మాట్లాడక పోతే నీ సంగతి వాళ్ళకు తెలిసేదెట్లా, మాట్లాడకుండాను మాట్లాడించకుండానూ ఎట్లా ?

విమ—ఆ ! మాట్లాడారా ? నా సంగతి బాగా తెలిసివస్తుంది. జాగ్రత్త ! కావాలంటే నా మెడకి ఒక బోర్డు కట్టుకోండి విమల B. A. చదువుతున్నది. సంగీతం బాగావచ్చు. నాట్యం కొద్దిగా వచ్చు.

మనో—అల్లాగే ! మీ అన్నయ్యని రానీ; కొంచెం గుండ్రంగా వ్రాయించి మెళ్ళో కట్టిస్తాను (వెళ్ళబోతుంది)

విమ—నిజంగా కట్టిస్తావా ఏం ఖర్మం !

మనో—నిజంగా కట్టించమనటం లేదా నువ్వు ?

విమ—కాదు, ఒదినా! నాకు నిజంగా, చెప్పు. ఈ పెళ్ళిచూపులతో ప్రేమలు పుడతాయా ?

మనో—ప్రేమ ఎప్పుడు పుడ్తుందో, ఎట్లా ప్రవర్తిల్లుతుందో, ఎట్లా పరిణమిస్తుందో, ఎట్లా ఫలిస్తుందో చెప్పాట [illegible] శక్యం కాదు.

విమ—అన్నయ్యా నువ్వూ చక్కగా కల్సిపోయారు. [illegible] పెళ్ళి చూపులనాడు అన్నయ్య వంక కన్నెత్తి [illegible] చూడ లేదు నువ్వు. కాని మీ యిద్దరూ ఎట్లా [illegible] ?

మనో—అదినా అదృష్టం.

విమ—[illegible]

[illegible]

మనో—మరేం లేదక్కా. మనసుపూర్తిగా ముగవాడికిన్వటం కంటెమరేం లేదు.

విమ—మనసుఇవ్వటానికీ, పుచ్చుకోవటానికీ కొన్నాళ్ళన్నా పడుతుందిగా ? మరి మీరు మొదట్నుంచీ...?

మనో—నేను మొదట్నే నామనసంతా ఇవ్వగలిగాను. అదేనా అదృష్టం.

విమ—ఎట్లా ?

మనో—అదో చరిత్ర. ఆసంగతి తెలియాలంటే నీకు చాలా చెప్పాలి.

విమ—నీకంటె నాకీవిషయాలు చెప్పేవాళ్లెవరున్నారువదినా? చెప్పవూ అదేమిటో ?

మనో—చెప్పటానికి చాలాచిన్నప్పటి సంగతి. అప్పుడే 3rd form లో చేరాను. పెళ్ళిసంగతి సరిగ్గా తెలియదు. ప్రేమసంగతీ తెలియదు. - అక్టోబరు నెల అనుకుంటాను. గుళ్ళో పురాణమో ఏదో చెప్తున్నారు. వినటానికి వెళ్ళాను. అంతలో గాలిదుమారం బాగాసాగింది. కళ్ళుపోడుచుకున్నా కానరావటంలేదు. మెల్లమెల్లగానడుస్తూ గుళ్ళోనించి యింటికిబయలుదేరాను. మాయిల్లు వూరిచివర దూరానవుంది. ఒంటరిగా తారట్లాడుతూ, కాలితో దారివెతుక్కుంటూ నడుస్తూంటగా కాలుజారింది క్రింద పడ్డాను.

[ఈమాటల్లో Lights ఆరిపోతాయి - నల్లతెర నిశ్శబ్దంగా లాగెయ్యాలి]

మనో— మొదట్లో ఎవ్వరో నన్ను చూశారు. ఎవరామనిషి అంటున్నారు. తలఎత్తిచూశాను.

[నల్లతెరముందు పడివున్న మనోరమమీద SPOT LIGHT పడుతుంది.]

ఓవ్యక్తి— ఎవరామనిషి!! ఎవరాపడిపోయింది?

[గబగబావచ్చి లేవదీస్తాడు]

వ్యక్తి— ఓ! నువ్వెవరో అమ్మాయివిలాగున్నావేం?

మనో— ఆ! అమ్మాయినే.

వ్యక్తి— అరే! పొరపాటు ... [వదిలేస్తాడు, మనోరమ మళ్ళీ పడిపోతుంది] అరే! మళ్ళా పడిపోయావా! లే; అబ్బాయినయితే నేనెల్లాగోఅల్లా లేవదీద్దును. [మనోరమ లేవడానికి ప్రయత్నిస్తుంది] పోనీ నాచెయ్యిపట్టుకొని లే, పైకి. [మనోరమ చెయ్యిపట్టుకొని లేవబోయి, లేవలేక పడుతుంది]

మనో— అబ్బ! కాలు బెణికింది.

వ్యక్తి— అహా! నడుమో! పడిపోతే? లే-లే, నిమ్మదిగా, ఇలాకాసేపుంటే ఇంటికి ఎత్తుకు తీసుకెళ్ళమనేట్టున్నావ్!

మనో— అబ్బ! నిజంగానే; బాగా నొప్పిగావుంది.

వ్యక్తి— అంటే నిజంగానే నన్నెత్తికెళ్ళమంటావా-అయితే?

మనో— అబ్బా! మాయిల్లుదగ్గరే, ఆసందుదాటితేమా ఇల్లే.

వ్యక్తి— చంపేశావ్ ... ఎవరమ్మాయివి నువ్వు?

మనో— విశ్వనాథంగారి అమ్మాయిని.

వ్యక్తి— ఈ ఊళ్ళో విశ్వనాథంగా రెవరు?

మనో—మా దీవూరుగాదు; రామకోటిగారింటికి వచ్చాం

వ్యక్తి— ఓహో! పెళ్ళికి వచ్చావా? అంటూ నెమ్మదిగా తేవ దీసి సరేకానియ్యి మరిఒంటరిగా యిట్లా చీకట్లో బయలు దేరేవేం? చీకట్లో షికారీ కొట్టడం సరదా నీకు?

మనో— అవును. సరదాయే!

వ్యక్తి — అదేం సరదా. నా మొహం సర్దా! ఇంకెప్పుడూ ఇటువంటి పిచ్చిపనులు చెయ్యకు. ఈఊరిసంగతి నీకు తెలియదు. ఈవూళ్ళో ఎటువంటి పచ్చిదొంగలున్నారో నీకు తెలుసా?

మనో— దొంగలా!!

వ్యక్తి— ఆ దొంగలు. ఆడపిల్లలు కనబడితే ఎత్తుకుపోయి ఊరిబయట ఏటిగట్టుకు లాక్కు—వెళ్ళి, నోట్లో గుడ్డలుకుక్కి...

మనో— అమ్మో!!

వ్యక్తి— మెళ్ళో నగలన్నీ తెంపుకుపోయి—!!...

మనో— బాబోయ్!!

వ్యక్తి— భయంలేదులే! నేనుండగా వాళ్ళెవరూ నీదగ్గరకు రారు. వాళ్ళందరూ నాస్నేహితులే!

మనో— ఆ! మీస్నేహితులా?

వ్యక్తి— ఆ నేనూ వాళ్ళల్లోవాణ్ణే. కాని నేను నీ నోట్లో గుడ్డలుకుక్కను. ఏటిగట్టుకుతీసికిపోను. మెళ్ళో నగలు మాత్రం తీసుకుంటాను.

మనో— సరేలా!! మా అమ్మానాన్న కోపపడతారు!

[తొందరగా రెండడుగులు వేస్తుంది]

వ్యక్తి— కోప్పడితేనాకేం ... అదేమిటి? దొంగలసంగతి వచ్చేటప్పటికి కాలునొప్పి ఎగిరిపోయిందా?

మనో— కాదు. కాలునొప్పిగా నేవుంది.

వ్యక్తి— అయితే నిజంగా దొంగల్ని పిలుస్తానాను. కాలునొప్పి పారిపోతుంది.

మనో— వద్దొద్దు. నడుస్తాను. కాస్త మాయింటిదాకా తోడురండి.

వ్యక్తి— మరినడు—వస్తా.

మనో— పదండి.

[నిమ్మళంగా పట్టుకొని నడిపిస్తాడు]

వ్యక్తి— నీకు పెళ్ళి అయిందా?

మనో— లేదు.

వ్యక్తి— ఊఁ! అయితే నన్ను పెళ్ళిచేసుకొంటావా?

మనో— ఆ!

వ్యక్తి— "ఆ" అంటావేం? ఈ చీకట్లో కనిపించటంలేదు గాని నన్ను వెల్తురులోచూస్తే తప్పకుండా పెళ్ళిచేసుకుంటావ్.

మనో— ఏం?

వ్యక్తి— ఏం ఏమిటి? అంత బాగుంటానునేను. నీకెందుకు నువ్వు పెళ్ళిచేసుకోముందు. తర్వాత ఎంత బాగుంటానో

నాకే తెలుస్తుంది పెళ్ళి చేసుకున్నావా — ... ...
ఎక్కడికి వెళ్ళినా దొంగలభయం నీకువుండదు. తెల్సిందా?
మనో— తెలిసింది. ముందు నన్ను మాయింట్లోదించండి.
తర్వాత — — —
వ్యక్తి— తర్వాత — — ?
మనో— పెళ్ళిచేసుకుంటాను ... ...
వ్యక్తి— (చేతిలోచెయ్యివేశి) ' ఇదిగో! ప్రమాణం కూడా చేశావు. జ్ఞాపకంపెట్టుకో.
మనో— అల్లాగే! '

[అంటూ ఇద్దరూ ప్రక్కకువెళతారు (Lights on) లైట్లువెలిగేసరికి మనోరమ విమలప్రక్కన యధాపూర్వకంగా నుంచుని వుంటుంది]

మనో— ఆ రాత్రి చీకట్లో అల్లాకల్సుకున్నాం-విడిపోయాం- ఆ సంఘటన మాత్రం మరచిపోలేకపోయాను. చివ్వరకు నా అదృష్ట కొద్దీ-అనుకున్న పెళ్ళిఅయింది. ఆ రాత్రల్లా నన్నేడిపించినాయనే. మీ అన్నయ్య.
విమ— కాని ఒకరినొకరు ఎల్లా గుర్తు పట్టారు.
మనో— మీఅన్నయ్య ఇంతవరకూ గుర్తుపట్టలేదు; కాని నేనుగుర్తుపట్టాను. ఆమాటలు ఆ చమత్కారం-చేతిలో చెయ్యివేసేతీరు, దొంగలంటూ భయపెట్టటం-అన్నీ అదే మాదిరి.
విమ— కాని-కాని-గట్టిగా అన్నయ్యే అతనని చెప్పటమెట్లా?
మనో— ఏమో! గట్టిగుర్తులు కాకపోయినా, నాకు గట్టిగా నమ్మకమే. ఆనమ్మకంతోనే జీవిస్తున్నాను కూడా.

విమ—అన్నయ్యోనని పెళ్ళిఅయినతర్వాత తెలిసింది. మరి ముందు పెళ్ళి కెట్లా ఒప్పుకున్నావ్ ?

మనో—ఒప్పుకోక ఏంచెయ్యను. గుర్తు ఎరుగనివారి నెవరినో మనసులోఉంచుకొని మొండికెత్తితే, ఎవరు సానుభూతి చూపెడతారు,

విమ—ఇంతకూ నీకట్లాకలిసివచ్చింది అల్లా అందరికీకలసి వస్తుందా ! మనసులోఉన్నవాడు. కాకపోతేమానె-మన సిచ్చిపుచ్చుకొనగలిగేవాడన్నా కుదరాలిగా ! ఏమొ ! ఒదినా-పెళ్ళన్నా, చూపులన్నా నాకేమిట్లో యిదిగా వుంది.

మనో—మరేం బాధపడకు. నీకునచ్చినవాణ్ణే చేసుకుందువు గాని— (బయట అడుగులచప్పుడు విని) అదిగో మీఅన్నయ్యవస్తున్నట్లున్నారు.

విమ—అడుగులచప్పుడువిని అన్నయ్యనుగుర్తుపట్టగలవా ?

మనో—ఆ-గుర్తుపట్టగలను. రోజూవింటానుగాదూ !

[మధుమూర్తి గబగబా లోపలికివస్తూ]

మధు—మనూ ! తొందరగాకానియ్యి వాళ్ళువచ్చేస్తున్నారు. మన శోభనాద్రి బాబాయిగారింటికివెళ్ళి మాట్లాడివస్తా మన్నారు. తొందరగా......

మనో—మాదేం ఆలస్యంలేదు.

మధు—(విమలవంకజూచి) ఓహో ! అప్పుడే అలంకారం అయిపోయిందే! (నవ్వుతాడు)

విమ—ఒనిస అలంకారంచెయ్యలే. నన్ను మోసంచేసిం డివ్వాళ.

మనో—అదేమిటి అట్లా అంటావ్ ?

విమ—అవునుమరి ! ఎందుకోననుకున్నాను, గాని ఈవేష మంతా పెళ్ళిచూపుల కనుకొన్నానా ?

మనో—ఫర్వాలేకపోతే; మోసంచేసినా మంచిపని మంచిపనే చేశానుగా

విమ—ఏమనావో ! ఇదిగో అన్నయ్యా ! నేనిప్పుడే చెప్తున్నాను. కావాలంటే నీపెళ్ళివారికి నువ్వుచెప్పుకో. వాళ్ళురావచ్చు, కూర్చోవచ్చు, చూడవచ్చు, వెళ్ళవచ్చు—కాని పిచ్చిపిచ్చిపరీక్షలు ప్రశ్నలూ, వేశారంటే మర్యాద దక్కదు—జాగ్రత్త ?

మధు— ఇదేంగోల ?

విమ—అవును. చిన్నపిల్లల్ని పరీక్షచేసినట్లు B. A. చదివిన దాన్ని పరీక్షచేస్తే అసహ్యంగావుండదూ ? కావాలంటే నా......మాసుకొనును.

మధు— కాని వాళ్ళకి నీకెంతరం ఎట్లాంటిదో ! మాటవంక వుందో, లేదో, తెలుసుకోకపోతే ఎట్లా ? వాళ్ళ కటువంటి అనుమానాలుండవచ్చు.

విమ—అటువంటి అనుమానాలు నాకూ ఉండవచ్చు. మరి నన్నూ నాలుగుప్రశ్నలూ అడగనిస్తారా ?

మధు—ఇదేదో కొత్త Law Point. వచ్చిందే. అది కనుక్కొని చెప్పాల్సిందే

విమ—కనుక్కో నే చెప్తా. నేనేం తొందర పడటంలేదు.

[గబగబా లోపలికి వెళ్ళిపోతుంది]

మధు — ఇదేం వరస!

మనో—ఇదో ఒక వరస- అసలు పెళ్ళిచూపులకి ఒప్పుకుంది- సంతోషించండి.

మధు—ఈ రుసరుసలో వాళ్ళనేమీ అడగదు గదా ?

మనో—అడగనివ్వండి. అడిగితే అంతా జవాబు చెప్పలేనివాడా పెళ్ళికొడుకు ?

మధు—జవాబు చెప్పలేనివాడుగా కనపడడు- కాని చెప్పలేని వాడయితే, ఎంత ప్రమాదమో చూడు- నిజానికి విమల ప్రశ్నలు వేయడం ఆరంభిస్తే ఒక్కొక్కప్పుడు- నేనే చెప్ప లేను.

మనో—అందుకనే, తెలివితక్కువదాన్ని నన్ను ఎంచుకున్నారు.

మధు—నిన్ను ఎంచుకున్నానుగాని నీ తెలివితక్కువతనానికి ముగ్ధుణ్ణైపోయి కాదు- దాని సంగతి ఇప్పుడుగాదు, కాని ఈ విమల సంగతేమిటో చూడు-ముందు.

మనో—ఒక చోట మనసుపడ్డదని పిల్లలకి అల్లాగే ఉంటుంది.

మధు—అల్లాగని ముందుగా మనస్సేర్పడితే అది మరీ కష్టంగాదా! విమలకు అటువంటిదేం లేదుకదా ? ఒక్కసారి విమలనిట్లా పిలు మాట్లాడాలి. విమలను పంపి నువ్వు కాస్త పెళ్ళి వారికి ఫలహారపానీయాల సంగతి చూడు.

సునో—...ఇల్లాగే-(లోపలికి వెళుతుంది)

[మరికాసేపట్లాగే ఆలోచిస్తూంటాడు. మధుమూర్తి. విమల నిమ్మదిగావస్తుంది.]

విమ—ఎందుకురా పిలిచావట ?

మధు—ఆ; పిల్చాను. చూడు విమలా ! పెళ్ళికొడుకును ఎంచుకోవటం చాలాక్లిష్టమైనసమస్య. ఏమంటావ్ ?

విమ—అవునంటాను.

మధు—మనమనస్సులో ఏదో ఒకకోరికవుండవచ్చు. అల్లా మనంచూసే మనిషి ఉండకపోవచ్చు. అందువల్ల నీమనసులో ఏదన్నా ఒకరూపంవుంటే, నువ్వుచూడబోయే కుర్రవాణ్ని దానితో పోల్చకూడదు.

విమ—నామనస్సులో ఏంలేదుగా ?

మధు—లేకపోతే ఫర్వాలేదు. కాని ఉంటే......

విమ—లేదుకాని ఒకరూపం ఉంటేనేకష్టమంటావా ఏమో ! నాకు ఏరూపంలేకపోతేనే కష్టంగావుంటుం దనిపిస్తోంది.

మధు—కాదు. ఒకరూపంఉంటేనేకష్టం. ఒకరూపం మనసులో ఉండగా దాన్ని మరచిపోవటంకష్టం. నీకు తెలియదు విమలా ? నాకు నీకూ వయస్సులో కొద్దితేడాయే కాని అనుభవంలో కాదు.

విమ—అయితే నీమనస్సులోఏదన్నా ఒకరూపంఉండివుండి?...

మధు—ఉండేది అదిఒకరూపంకాదు. నాకల్పన-నేనొక అమ్మాయిని ఒకరోజున అర్ధరాత్రివేళ- చీకట్లోకల్సు

కన్నాను. చీకట్లో మొహం చూడలేదు. మాట్లాడాను. కాని కంఠంగూడా జ్ఞాపకంలేదు. ఏతావాతా, నామనసులో ఒక ఊహాచిత్రం—ఊహించుకున్న కంఠస్వరంమాత్రం మిగిలాయి.

విమ——అదేమిటి !! అల్లా ఎల్లాజరిగింది?

మధు——ఒకరోజున ఒకస్నేహితుడింటికి కొత్తవూరు వెళ్ళాను. సాయంత్రం షికారుగా వెళ్ళి ప్రొద్దుపోయి తిరిగివస్తూ, గాలిదుమారంలో చిక్కుకున్నాను. గాలిదుమారంలోనే ఓ అమ్మాయిని కలుసుకున్నాను. ఆ చీకట్లోనే మాట్లాడేను. అంతే! ఆ అమ్మాయి వెళ్లిపోయింది. నామనసులో శాశ్వతంగా నిలిచిపోయింది. ఇక ఎన్నడు కల్సుకునే అవకాశమే లేకపోయింది.

విమ——ఆహా! అలాగా? అయితే ...?

మధు——చివరకు మీ వదినను పెళ్లిచేసుకున్న తర్వాత గూడ నాకు మనశ్శాంతి కలగలేదు. నే నిదంతా ఎందుకుచెప్తూ న్నానో గ్రహించావా?

విమ——ఆ గ్రహించాను. నామనస్సులో ఏ రూపమూ లేదు. కాని కోరిక ఒక్కటేవుంది. నా భర్త కాబోయేవాడు నన్నూ ఒక వ్యక్తిగా గౌరవిస్తేచాలు.

మధు——అయితే సరే. ఈ రాబోయే కుర్రవాడు చాల బుద్ధిమంతుడే! మనూ! మనూ! ఫలహారాలసంగతి చూశావా?

[అంటూ లోపలికి వెళ్ళబోగా మనోరమ ఎదురువస్తుంది]

మనో—ఫలహారాలు సిద్ధంగానే వున్నాయి. మీరెళ్ళి రెండు కిళ్ళీలుకూడా తీసుకురండి. ఇదిగో విమలా; రెండుముద్దలు తిందువుగానిరా! తర్వాత వాళ్ళందరూ తింటుంటే నీకు నోరూరవచ్చు.

విమ.—ఈ వేళాకోళాలికేం లే! నాకాకలివుంటే అక్కడ తీసుకొనే తింటాను. నీకుమల్లే అనుకున్నావా?

మనో—ఛ; అల్లా ఎందుకనుకుంటాను? నువ్వుతినటం ముదలెడితే వాళ్ళకి మిగలొచ్చాయా అనుకుంటాను.

[అందరూ నవ్వుతూవుండగా బయటబండి ఆగిన శబ్దం]

మధు— అదిగో వాళ్ళు వచ్చేశారు.

[మధు ఎదురువెళతాడు]

మనో—అదిగో– ఆకుర్రాడే లాగుంది! ఆ రెండో ముసలాయన ఎవరో?

విమ—ఇంకెవరు? ప్రశ్న వేసి నాదుంప తెంపటానికి ఆ పార్టీ తెచ్చుకున్న ప్లీడరు.

మనో—మొహంచూస్తే చాలా తెలివిగలవాడేలాగుంది.

విమ—ఎవరు? ప్లీడరా?

మనో—కాదు – పార్టీ.

విమ—ఆ – తెలివిగలవాడే! (సిగ్గుపడి) రా; మనం లోపలికి పోదామింక.

మనో—ఏం? లోపలికెందుకు?

విను—ఇక్కడ వుండడమేమిటి అసహ్యంగా! (సిగ్గుపడుతుంది)

మనో—సిగ్గుపడకుండా నువ్వు ఎదురు వెళ్తా ననుకున్నాగాని, మాకున్నట్లే వెళ్ళి దాక్కుంటా వనుకోలేదు. పద—అయితే—

[ఇద్దరూ లోపలికి వెళ్తారు. బయటనుంచి మధుమూర్తి, ప్రభూ, శర్మగారు వస్తారు]

మధు—రండి, ఇల్లా దయచేయండి.

శర్మ—ఫర్వాలేదులే; ఫర్వాలేదు—కూర్చుంటాంగాని నువ్వే మా మర్యాదలకోసం బాధపడకు. రావోయి ప్రభూ! ఇల్లా కూర్చో.

ప్రభు—కూర్చుంటాను. మీరిద్దరూ ఒక్కటేగనక మీలో మీకు మర్యాదలక్కర్లేదు. కాని నేను పరాయి వాణ్ణిగా; ఇల్లా కూర్చుంటాను.

శర్మ—నువ్వు మాత్రం నాకు పరాయివాడివేమిటి? మీ నాన్నా నేనూ "ఏరా అంటే ఏరా" అనుకుంటాం, తెలియదూ?

మధు—మరి మా నాన్నగారికీ, మీకూ కూడా ...

శర్మ—ఆ—మీ నాన్నా నేనూ ఒకరేఅంటే ఒకరనుకునేవాళ్ళం. ఎటొచ్చీ వాడు చచ్చిపోయిన తర్వాత ఈ అయిదారేళ్ళనించీ మిమ్మల్ని చూడలేదు కాని లేకపోతే ఈ విమల పెళ్ళి ఇన్నాళ్ళు కాకుండా వుండేదా—నువ్వెక్కడో దూరపు సంబంధం చేసుకునేవాడివా? పాపం! తల్లీదండ్రీ పోయినా చక్కగా సంసారాన్ని సాక్కువస్తున్నావనీ, బుద్ధిమంతుడి వనీ విన్నాన్లే. నువ్వెరగవ్ గాని ప్రభూ! మన మధుమూర్తి

పక్క-సరిగమ; సంగీతంగూడా బాగాపాడేవాడు చిన్నప్పుడు. విమల సంగతి నాకు బాగా తెలియదు ఇంత పిల్లప్పుడు చూశాను. అంతే-

ప్రభు—మొన్న బాగా పాడుతుందని అన్నారు?

శర్మ—మొన్న నేగా అన్నా. అన్నమాట నిజమే. అల్లా అనకపోతే, నువ్వు కదలిరావేమోనని అమాంతం అబద్ధం ఆడేశా; ఆడపిల్లలకి ఆమాత్రం సంగీతం రాదాఅని అనేశాను. నేను ముందు అబద్ధంఆడినా సాధ్యమైనంత తొందరగా అబద్ధమని ఒప్పుకుంటా.

ప్రభు—అవుస్లెండి. వారి జాతకములందు వైవాహికములందు అని అన్నారుగా.

మధు—కానిమీరన్నదీ అబద్ధం కాదులెండి, శర్మగారూ విమలకు ఆమాత్రం సంగీతం వచ్చు.

శర్మ—ఆహా! ఇంకేం? చూశావా ప్రభూ! నేనబద్ధంఆడినా అది నిజమయి ఊరుకుంటుంది.

ప్రభు—ఒక్కొక్కరి అదృష్టంఅది. నేను నిజంచెప్పినా అబద్ధమయిపోతుంది.

శర్మ— ఆఁ,మధూ! త్వరగా కానీ; మళ్ళీచీకటిపడితే పెళ్ళికూతుర్ని చూడటం ఏం బాగుండదు.

మధు—ఆలస్యం ఏంలేదండి; వాళ్ళు రెడీగానే వుంటారు.

[లోపలికి వెళ్లబోతుండగా]

శర్మ—ఆ-ఆ-అదేమంచిది. పెళ్ళికావాల్సిన ఆడపిల్లలు "ఎప్పుడు ఏం రాబోతోందో నని" ఎప్పుడూ రడీగ్గా ఉండ టం మంచిది.

[నవ్వి మధు లోపలికి వెళతాడు]

శర్మ—చూశావా ప్రభూ! పెళ్లికూతుర్ని చూశటం వుందే-అది ఒక కళ ...

ప్రభు—దాని సంగతి నిన్నా చెప్పారు.

శర్మ—పన్నా చెప్పాను. మొన్నా చెప్పాను. నిజానికి ఆరేళ్ళ నించీ నేను రోజూ ఎవరికో ఒకరికి చెప్తూనే వున్నాను. కాని పెళ్ళికొడుకులు పప్పులో కాలేస్తూనే వున్నారు. ఆడపిల్ల వెంటబడి ఏడిపించే కాలేజీ కుర్రవాళ్ళుకూడా పెళ్ళికూతురు ఎదటకొచ్చేసరికి సిగ్గుపడిపోతారేమోయ్!

ప్రభు—ఏమో!

శర్మ—చూడూ! పెళ్ళికూతురువచ్చి కూర్చుంటుంది. రాం గానే అదేపనిగా అటేచూస్తూ కూర్చోకూడదు. అట్లా అన్నానని అసలుతలవంచుకోకూడదు. చూస్తూఉండాలి-చూడకుండానూ ఉండాలి. ఒకసారి చూచినప్పుడు, మొహాం బాగుండలేదా చూడాలి. మరోసారి చూసి నప్పుడు రంగుసంగతి చూడాలి. మళ్ళీసారి ఆరోగ్యం సంగతీ, తర్వాత "నాజూగ్గా ఎదిగినపిల్లా! బొద్దుగాఎదిగిన పిల్లా!" చూడాలి. సరే; ఏదో మాట్లాడించి చూట్టానికీ, నాబోటివాణ్ణి ఉన్నానుగా, ఏమిటి ఆలోచిస్తున్నావ్? పాడించి చూట్టానికీ,

ప్రభు—మీరిన్ని సార్లూ చూశే చేసుకున్నారా మీఆవిణ్ణి ?

శర్మ—ఇన్ని సార్లేమిటి! చాలాసార్లు చాలారకాలుగా చూశి-పరీక్ష చేసి చేసుకున్నాను. ఇప్పుడంటే ఇల్లా లావుగా-బుంగగా-తయారయిందిగాని, చిన్నప్పుడు కూడా ఇల్లాగే ఉందనుకున్నావేం?

ప్రభు—ఇప్పుడల్లా ఉన్న తర్వాత-అప్పుడెప్పుడో ఎల్లా వుంటే నేం?

శర్మ—అదే నీపిచ్చి-తర్వాత ఎల్లా తయారయినా నీజ్ఞాపకం వుండే ఇదే. అదీకాక, నేచెప్పలే! పెళ్ళికూతురుని ఎక్కువగా చూట్టంకన్న పెళ్ళికూతురు తల్లిని తండ్రినీ అక్క చెల్లెళ్ళనీ ఎక్కువగా చూడమనీ-ఆపోలికలబట్టి పెళ్ళికూతురు ముందు ముందు ఎల్లా మారగవుతుందో ఊహించుకోవచ్చు.

ప్రభు—మరి ఈ పెళ్ళికూతురు తల్లిదండ్రులు లేరుగా?

శర్మ—తల్లిదండ్రులు లేనప్పుడు ఇక-ఫొటోలు చూడు. ఈ గోడనన్నా Photo లు కనపడ్డాయ్.

ప్రభు—అవునండోయ్-(దిక్కులుచూసి) కాని Photo లు లేవే!

[అంటూ గోడమీదవున్న మనోరమా మధుమూర్తుల ఫొటోలుచూసి దగ్గరకు వెళ్ళి]

ప్రభు—ఇది ... మధుమూర్తిగారి పెళ్ళిఫొటో -! ఈ అమ్మాయి ఈ-అమ్మాయిని ఎక్కడో చూసినట్లున్నానే!!

శర్మ—ఎక్కడా?

ప్రభు—ఎక్కడో గుర్తుకురావడంలేదు. ఎక్కడో...ఎక్కడోనండీ ... !! ...

శర్మ—ఆ. ఇహారా—ఇవతలకి. జ్ఞాపకంరాకపోతే మునిగి పోయిందిలేవులే; ఆఫొటో చూస్తూ నువ్వు కూర్చుంటే - వాళ్ళేమన్నా అనుకుంటారు.

ప్రభు—అనుకోటానికేముంది.

శర్మ—ఏముందంటావేమిటి? అదేపనిగా అట్లాచూస్తుంటే ఎవరయినా ఏమన్నా అనుకోవచ్చు. రా, రా. అదిగో మధుమూర్తికూడా వస్తున్నట్టున్నాడు!

ప్రభు—కాని ... ఈఫొటోలో వున్నావిడను — అదే, మధుమూర్తిగారి భార్యని-నేనెక్కడో చూశానండీ! ఎక్కడో! ఆ! చూశాను! జ్ఞాపకంవచ్చింది. మరే! చూసి పెళ్లిచేసుకుంటే అట్లాంటి అమ్మాయినే పెళ్లిచేసుకోవాలనుకున్నాను.

శర్మ—బాగా అనుకున్నావ్! ఏడిచినట్లుంది. ఇంకా నయం. ఇహ అలాఅనుకోకు. అధమం ప్రస్తుతం ఈగంటసేపన్నా అలా అనుకోకు.

ప్రభు— ఏం అనుకుంటే?

శర్మ—ఏం అనుకుంటే! నువ్వనుకుంటే నేనూరుకుంటే, మధుమూర్తికూడా వూరుకుంటాడనుకున్నావా?

ప్రభు—కాదండీ; నేచూసినమ్మాయి. ఈ అమ్మాయికాదేమో! కాని చాలా మంచిఅమ్మాయి. నిజానికి ప్రేమ అంటేఅదే ప్రేమ ఒకవేళ ఆఅమ్మాయీ, ఈఅమ్మాయీ కాకపోతే, ఆ అమ్మాయికి పెళ్లి కాకపోతే, ఆ అమ్మాయినే పెళ్లిచేసుకుందామనివుంది.

శర్మ—ఆ మాట మన మిక్కడికిరాకపోతే అనుకోవాల్సింది వచ్చాంగనక, ఈ అమ్మాయిమాట ఆలోచించాలి గాని! గోడనున్న బొమ్మలమాటగాదు. తలుపుచాటునవున్న కోడలిమాట కాదు.

[ప్రభు తలుపువంక చూస్తాడు]

శర్మ—ఏమయ్యోయ్! నా మాటవింటున్నావా? గోడలవంక చూట్టంమానేశి ద్వారబంధాలవంక చూస్తున్నావేమిటి?

ప్రభు—కాదండీ! ఆ అమ్మాయి ...

శర్మ—ఆ అమ్మాయివంకే చూడద్దంటున్నది.

ప్రభు—కాదండీ! ఈ ఫోటో అమ్మాయికాదు. ఇంకో అమ్మాయి తలుపువెనకనుంచి అటువెళ్లింది.

శర్మ—వెళ్ళిందా? ఇంకో అమ్మాయి!! అయితేచూడు.

ప్రభు—ఇదిగో అవతలగదిలోంచి ప్రక్కగదిలోకి వస్తోంది, గోడమీద ఆమ్మాయి.

శర్మ—అయితే ఆగు. ఇవాళ చూడకు.

ప్రభు—వెనకనే. అదిగో రెండో అమ్మాయికూడావస్తోంది.

శర్మ—బాగుంది. ఆగు. నేను ఈతలుపువంక ఎప్పుడు చూడాలో, ఎప్పుడు కూడదో చూశి నీకు Signals ఇస్తాను. రామరామా!! ఇంకా రాడేం ఈమధుమూర్తి.

ప్రభు—ఏం! మీకు తొందరగా ఉన్నట్టుందే.

శర్మ—అక్కడికి నీకేం తొందరలేనట్టు—తొందర నాకు ఉండదూమరి? ఇక్కడికి నేను పెళ్లిపెద్దరికం చేయటానికి

వచ్చానుగాని, నీకు Signals ఇవ్వటానికన్నా—దుగా రా, రా, కూర్చో ఇటువైపు తిరిగి ..... !

ప్రభు—అల్లాగే కాని...(వచ్చి కూర్చుని మీరిప్పటికి ఎన్ని పెళ్ళి చూపులు ఇల్లా దగ్గరుండి నిర్వహించారండీ?

శర్మ—ఓ లెక్కేమిటి? దాదాపు రెండు నూరాడు వందలు నిర్వహించి ఉంటాను.

ప్రభు— అందరూ ఇప్పుడు కులాసాగా కలిసి ఉంటున్నారా?

శర్మ— ఆ- ఆ- చాలమంది కలిసే వుంటున్నారు. లెక్క వెయ్యలేదుగాని వేస్తే కలిసి వున్నవాళ్ళే ఎక్కువ. కొందరికి ఎంత తంటాలుపడ్డా పొత్తు కుదరకపోవచ్చు. పొత్తు కుదరకపోయినా కొందరు కలిసే ఉండవచ్చు. కనక కులాసాగా ఎందరు కల్సివుంటున్నారో చెప్పటం కష్టం.

ప్రభు—మరి ఈ పెళ్ళిచూపుల తతంగం ఎందుకు? చూపులు కలిస్తే మనసులు కల్సినట్టు కాదుగా ?

శర్మ—కాదు. మనసులు కలిస్తే చూపులు కలవవనే అక్కర్లేదు. కాని దేనికైనా, ఓ ప్రారంభం జరగాలిగా? చూపుల్తో మొదలెట్టి, తర్వాత మాటామంతితో, మనసులు కలుస్తాయి.

ప్రభు—ఏదయినా ప్రేమంటే తెలియని వయస్సులో పెళ్ళి చేసుకోనటం తప్పేనండీ!

శర్మ—ప్రేమంటే పూర్తిగా తెలిస్తే పెళ్ళి అక్కర్లేదు. పెళ్ళంటే ప్రేమకు "ట్రయినింగ" యిస్తే. పెళ్ళయి, ట్రయినింగైతేగాని ప్రారంభం కాదు ప్రేమ. "పెళ్ళి చేసుకో, ప్రేమ నేర్చుకో" పెళ్ళిముందు ప్రేమలు పెదవిమీద మాటలు.

[మధుమూర్తి ఫలాహారపు పళ్ళాలతో వచ్చి ప్రభు శర్మల ముందు పెడతాడు]

శర్మ—ఇంకేమన్నా ఆలస్యం ఉందా ఏమిటి?

మధు—ఏంలేదండీ; మీరు ఫలాహారం చేయటమే ఆలస్యం.

శర్మ—అయితే త్వరగా కానియ్యి. ప్రభూ, నువ్వుకూడా కూర్చోవాలి మధూ! రా కూర్చో.

[ముగ్గురూ కూర్చుని ఫలాహారం చేస్తూ]

మధు—ఏదో నేసీ లాంఛనాలన్నీ ఇప్పటివరకూ ఎరగను. తప్పులుంటే క్షమించాలి.

శర్మ—అబ్బాయ్! విను. ప్రభూ చాలా మర్యాద ఎరిగిన వాడు. మీ చెల్లెల్ని చూసి, నచ్చితే పెళ్ళిచేసుకుంటాడు. అంతేకాని ఈ లాంఛనాలని చూసి వ్యామోహంలో పడేవాడు కాదు. చాలా నిక్కచ్చి మనిషీ - కనక నచ్చింది నచ్చందీ ఒక్క ముక్కలో చెప్పేస్తాడుగాని నాన్చడు. కాస్తో కూస్తో ఆస్తి వున్నవాడే.– తండ్రి ఇంకా సంపాదిస్తున్నాడూ, అయినే సరే- "తన కాళ్ళ మీద తను నిలబడాలని తను స్వతంత్రంగా సంపాదించు

కుంటున్నాను. దేశ రాజకీయాలు విదేశీయ విశేషాలూ తిన్నగాగా చదివినవాడైనా ఏ రాజకీయపార్టీలోనూ చేర లేదు. ఇంగ్లీషులో ఫస్టు మార్కులు వచ్చేవి, కాని మామూలుగా ఇంగ్లీషు మాటలు దొర్లించకుండా తెలుగు బాగా మాట్లాడతాడు. సిగరెట్లు తాను కాల్చడు, ఎవరన్నా యిస్తే వద్దనడు. గంటలకొలదీ ఏ విషయమైనా మాట్లాడగలడు. అవసరమైతే గంటలకొలదీ వింటూ మాట్లాడకుండా కూర్చోగలడు.

శర్మ—ఇన్ని ఉత్తమగుణాలు మామూలుగా ఎంతమంది 'కాబోయే పెళ్ళికొడుకుల' దగ్గర కనబడతాయంటావ్.

ప్రభు—మీరుమాటల్లో ఫలహారంసంగతిమర్చిపోతున్నారు.

శర్మ—మర్చిపోతే, ఇంతకంటె మంచివాటికోసం ఎదురు చూస్తున్నానన్న మాట. తీసుకురావోయ్ విమలని. మరేమీ షోకులూ అలంకారాలూ లేకపోతే మునిగి పోయింది లేదులే.

మధు—అలంకారాల ఆవశ్యం కాదండీ; ఏదో B.A. దాకా చదవటంవల్ల, పెళ్ళిచూపులకని తలవంచుకుకూర్చో టానికి విమలకాస్త పేచీపెడుతోంది-వాళ్ళవదిన ఒప్పి స్తోంది.

[విమల గబగబావచ్చి]

విమ—నన్నెవ్వరూ ఒప్పించక్కర్లేదు-రప్పించక్కర్లేదు. నేనే రాగలను. ఏమండీ! నేనే విమలను. సరిగ్గాచూడండి.

B. A. చదివాను—పాడతాను, నాట్యంచేయగలను. చదవ గలను. కావాలంటే చక్కగా వేషంవేసుకుని, బొమ్మ లాగా మీవెంట ఎక్కడికిపడితే అక్కడికి రాగలను. లేకపోతే వంటింట్లో ఒంటరిగాకూర్చుని ఏడవగలను. మీకింకా ఏఏపరీక్షలుకావాలో చేసుకోండి. ఏజవాబులు కావాలో అడగండి.

శర్మ—ఆ! (తెల్లబోయిచూస్తూంటాడు.)

[నిమ్మదిగా ప్రభు లేస్తాడు]

ప్రభు—(దగ్గరకెళ్ళి) నన్ను పెళ్ళిచేసుకోగలవా!

విమ—ఆ!

ప్రభు—పెళ్ళిచేసుకోవటం చేతవునా?

విమ—చేతవును.

ప్రభు—ప్రేమంటే ఏమిటో తెల్సా?

విమ—నాకదేమీ తెలియదు; పెళ్ళిచేసుకోవటం పీటలమీద కూర్చోవటం తెల్సు. వంటచేయటం తెల్సు. భర్తగారి ఆనందంకోసం సరదాలకోసం ఆడటం, పాడటం, అంతా తెలుసు. చాలదూ? ప్రేమంటే నిర్వచనంకూడా తెలి యాలా?

ప్రభు—నాకువంటచేసిపెట్టటానికి, నాకోసం పాటపాడటానికీ, ఆటఆడటానికీ మరబొమ్మలూ, మట్టిబొమ్మలూ చాలా దొరుకుతాయి. ప్రేమంటే అర్థంచేసుకుని నామనసు తను తెలుసుకుని, తనమనసు నాకివ్వగలమగువ నాకావాలి,

నాపాట తనుపాడక్కర్లేదు. నానెత్తిమీదికెక్కి ఆడా అక్కర్లేదు.

శర్మ—బాగుంది-రెండుమూడొందల పెళ్ళిచూపులూ ఇంకా అన్ని పెళ్ళిళ్ళూ నిర్వహించానుగాని, ఇల్లా ఎప్పుడూ...!!!

విమ—అయితే ప్రేమంటే, ఏమిటో నిగూఢతత్వాన్ని, మరెవ్వరికీ తెలియదంటూరా?

ప్రభు—నాకు తెలియదు. కాని ఊహామాత్రంవుంది.

శర్మ—ఏమన్నావ్-ప్రేమ ఊహామాత్రంగాఉండటమేమిటి?

ప్రభు—అదే! స్త్రీహృదయంలో ఎంతప్రేమవుండవచ్చో, ఒకసంఘటనచూడగా తెల్సింది.

శర్మ—ఏమిటది?

ప్రభు—విశాఖపట్నం చదువుకువెళ్తూ వస్తూఉన్నరోజుల్లో రెండీ. బండిలో కొత్తదంపతులిద్దర్ని చూశాను. ఆభర్త ఏవేవోమాట్లాడుతున్నాడు. నవ్వుతున్నాడు. నవ్విస్తున్నాడు ఆమె పెదవికదపకుండా భర్తవంకేచూశీ సంతోషిస్తోంది. సంతోషం కళ్ళనిండావుంధికాబోలు. కదిలితే సంతోషం ఎక్కడ ఒలికిపోతుందో అన్నట్లు ఆమెతల కదలకుండా జాగ్రత్తపడుతోంది. అది సంతోషమో సంతృప్తో నాకు తెలియదు. కళ్ళల్లో సంతోషం హృదయంలో సంతృప్తి రెండూ ఉన్నాయేమో!! అందరం ఏలూరిలో దిగాం; నేను నా స్నేహితుణ్ణి చూట్టానికి దిగాను. వాళ్లింపనిమీద దిగారోఏమో!

కాని ఆరాత్రే సినిమాలో ఈ దంపతు లిద్దరి వెనకా, నేనూ నాస్నేహితురాలూ, కూర్చోవటం తటస్థించింది. నేను సినిమా చూట్టం మానేసి ఆచీకట్లోనే—వెనకనుంచి ఆమె వంకకనిపెట్టి చూస్తున్నాను. ఆమె సినిమాచూట్టం మానేసి ఆచీకట్లో అతనివంకే చూస్తోంది. సినిమాలో రకరకాల సుఖదుఃఖాలున్నాయి కాబోలు—అతను నవ్వితే ఆమెకూడా నవ్వుతుంది. అతను "అయ్యో పాపం" అంటే ఆమె కన్నీళ్లుపెట్టుకుంటోంది. సినిమా ఎప్పుడయి పోయిందో ఏమో మేమందరం బయటికి వచ్చాం. నడిచి ఇంటికి వెళ్తున్నాం—అక్కడక్కడా మినుకుతున్న లైట్లు తప్ప అంతా చీకటి—చీకట్లో దంపతులు ముందువెళ్తు న్నారు. వారి వెనకనే మేమూ కొంతదూరం వెళ్ళాక— ఆవీధిలో, ఆ దంపతులూ వారి వెనక మేమూ తప్ప ఎవ్వరూలేరు. భర్త సంతోషంతో పలకరిస్తూ, కిలాకిలా నవ్వటం మాత్రం వెనకెక్కడోవున్న మాకు వినిపిస్తోంది. మేం నడుస్తూనేవున్నాం—

[Lights off మధు నవ్వు వినిపిస్తుంది. నీలి తెరముందు మధు మనోరమలు కనుపిస్తారు నవ్వుకుంటూ Lights on]

మధు—ఈ చీకట్లో యీ కొత్త ఊళ్ళో అమాంతం దొంగలు మనిద్దర్నీ నిలవేస్తారనుకో! ఏం చేస్తావ్!

మనో— నేనేంచేస్తాను, కావాలంటే ఒంటిమీద నగలు రెండూ తీసుకుపొమ్మంటాను.

మధు—దొంగలంటే మర్యాదగావచ్చి, "వస్తువులియ్యలేకపోతే, చంపేస్తాం" అంటారేమిటి?

మనో—ఆ!

మధు—రావటం రావటమే ముందు కత్తితో నాలుగు వడ్డిస్తారు. తర్వాత ఒంటిమీదవని వల్చుకుంటారు.

మనో—వాళ్ళపుంస తెగాలి! వాళ్ళసంగతిప్పుడెందుకూ? తొందరగా నడవండి; ఇంటికి పోదాం!

మధు—కాని ఆ యిల్లెక్కడుందో తెలిస్తే, ఈపాటికి అక్కడికి చేరేవాళ్ళమే గా? అది తెలియక ఇప్పటికే నాలుగు వీధులూ తిరిగాం.

మనో—పోనీ, బండో రిక్షాయో, దొరికితే, బాగుండును.

మధు—సినిమాహాలు దగ్గరే లేవు. ఇంకెక్కడ దొరుకుతాయి?

మనో—ఎవర్నైనా అడిగితే?

మధు—దోపిడీ-దొంగలు కాకుండా, ఎవరైనా ఎదురుపడితే అడగవచ్చు.

మనో—మళ్ళీ దొంగల సంగతి! దొంగలంటే నాకేం భయమనుకున్నారా?

మధు—భయం లేదూ?

మనో—భయం లేదు, పాడూ లేదు. మీ కాకబుర్లంటే సరదా; మీ సరదాయే నాకూ సరదా.

మధు—కాని దొంగల్ని చూస్తేమాత్రం సరదాగావుండదు. ఆ సంగతి నీకు తెలియదుగనక సరదాగా ఉన్నట్టుంది.

అహా నో! అటు వెనక్కి తిరిగిచూశాను. వాళ్ళెవరో ఇద్దరు వస్తున్నారు. సినిమాహాలునుంచీ మన వెనకనే వస్తున్నారు. ఒకళ్ళతో ఒకళ్ళు మాట్లాడుకుంటూ, నేను వెనక్కి చూసినప్పుడు చీకట్లో నక్కుతూ,

మనో——నిజంగా!!

మధు——నిజంగానే! వెనక్కి చూడు. నా మాట అబద్ధమయితే!

మనో——మనం త్వరగా నడుద్దాం, పదండి.

మధు——మనం తొందరగా నడుస్తే పారిపోతున్నామని పరుగెత్తుకొస్తారు.

మనో——మరేం చేద్దాం?

మధు——అదే ఆలోచిస్తున్నా! (వెనక్కి చూసి) చూశావా మనం ఆగామని వాళ్లూ ఆగారు.

మనో——(చూసి) అవును. తొందరగా పోదాం రండి.

మధు——భయపడకు. భయపడితే వాళ్ళకి లోకువ అయిపోతాం.

మనో——మరెట్లా!!

మధు——ఆగు. ఒక్కటే ఉపాయం. నువ్వాపక్కన నుంచో. వాళ్ళు వస్తారు. కలియబడి ఇద్దర్నీ చావగొడతాను.

మనో——ఆ పని చెయ్యకండి మీకు పుణ్యమాయిరి.

మధు——అరే! వాళ్ళు వచ్చేస్తున్నారు.

మనో——పదండి. ముందుపోదాం.

మధు——దగ్గరకొచ్చేశారు.

మనో—తొందరగా ఈసందులోకి పోదాం?

మధు—కాని ఆ సందు మరీ చీకటిగావుంది.

మనో—పోనీ ఇటుపోదాం !

మధు —నాకు మరీ భయంగావుంది.

మనో—అందుకే ఈసందులోకి ...

మధు — అదుగో! వచ్చేశారు ? (భయంతో వణుకుతాడు)

[ప్రభూ మనోస్నేహితుడూ వస్తారు]

ప్రభు—ఇటే వెళ్లారు. పదతొందరగా.

[మనోరమ ఎదురువస్తుంది]

మనో—ఎందుకు మీారు వెంటవస్తున్నారు?

ప్రభు—ఆ !

మనో—అక్కడే ఆగండి. ముందుగా స్త్రీ-జాగ్రత్త!

ప్రభు—కాదండీ? మేము ...

మనో— ఏంమేము? ఈ పాడునగలకోసమేనా మా వెంటపడి కొట్టి, లాక్కుపోవాలనేనా; నగలకోసంఇంతదుర్మార్గమా.

ప్రభు—మేము ... మీా వెంట ...

మనో—జాగ్రత్తగా ఉండండి. ఏదైనా వారి వంటిమీాద ఈగ 'వాలినా ఊరుకోను. కావాలంటే పాడునగలు తీసుకుపొండి.

ప్రభు—నగలు ... కాదండీ ... నామాట.

మనో—మాటలేదు; మంతీలేదు. అసలే ఆయనకి దొంగలంటే భయం; ఆయన్ని అదరకొడితే మీాకొచ్చే లాభమేమిటండీ?

మధు.—(నవ్వి) రా, మనూ ... నాంగలిట్లా ఉండర్లే, వీళ్లె వరో చదువుకునే కుర్రాళ్ళు.

మనో—ఆ!

మధు—మీరాదోవన మీరెళ్ళండి మిష్టర్. ఇదేనో మాఆలు మగలమధ్య సరాగం వాంగలంటే నాకు భయమనుకొని, మా ఆవిడ మీకు ఎదురు తిరిగింది.

[అందరూ నవ్వుతారు]

[Lights off ... ... ... on ... అంతా యథాపూర్వకంగా కనిపిస్తుంది. అందరూ నవ్వుతుంటారు]

ప్రభు—ఆ అనురాగంలో పుట్టిన ఆగ్రహాన్ని అల్లా ఆ వేళ చూశాను. ఎంతో ఆనందించాను పెళ్ళాడితే అటువంటి స్త్రీనే పెళ్ళాడాలనుకున్నాను నాకెక్కడా ఎవ్వరూ కన్పించలేదు ఆనాటి కీనాడు ఆ మెగారి Photo ఇక్కడ గదిలో కన్పించింది. ఆనాడల్లా భార్య నేడిపించిన భర్త నీ రేసనుకుంటాను. [మధువంక చూస్తాడు]

మధు—నేనే సాధారణంగా మాభార్యాభర్తల సరాగా లిల్లాగే వుంటాయి.

ప్రభు—ఏదయినా అదృష్టముండాలి—ఆ అదృష్టం ఎంతమందికి! నేనూ మీ చెల్లెల్ని పెళ్ళాడితే అంతఅదృష్టవంతుణ్ణి అవుతానా ?

శర్మ—ఏమమ్మా విమలా ? ఈయన అనేదివిన్నావా ?

విమ—లేస్తున్నాను. నేనూ అదే ప్రశ్న వేస్తున్నాను. నేనూ అంతఅదృష్టవంతురాలిననగలనా యీ పెళ్ళితో !!

శర్మ—సరే; ఇప్పట్నించీ ఒకరితో ఒకరు వంతులుపోతేఎట్లా?

మధు—వంతులుపోనక్కర్లేదు. విమ్లలా! నామనస్సులోవున్నది కూడా చెప్పనియ్యి. నేనూ మనసూమనసులుకలిసిన దంపతుల్లాగవున్నామని ఒప్పుకుంటావుగా ?

విమ—ఆ!

మధు—నిజానికి అదిఅబద్ధం. నేనుమిమ్మవదినను మోసం చేస్తున్నానంటే! నిజానికి నామనసు వేరేచోటవుంది. కాని పెళ్ళిచేసుకున్నతర్వాత దాన్ని బాధపెట్టటం ఇష్టం లేక, నామనస్సు చంపుకున్నాను. అసంతృప్తిలోనే తృప్తిపొందాలని ప్రయత్నిస్తున్నాను. నిజానికి నామనస్సు వేరేచోట లగ్నమయివుంది.

విమ—కాదు. నిన్ను చీకట్లోకలుసుకుని మాట్లాడిన అమ్మాయి ఒదినే.

మధు—ఆ!

విమ—మీ అదృష్టంకొద్దీ మీరేభార్యాభర్తలయ్యారు.

మధు—ఇది నీకెట్లా తెలుసు ?

విమ—ఒదినేచెప్పింది. నువ్వే తననుకలుసుకున్న యువకుడవని ఒదినగుర్తించింది.

మధు—గుర్తించిందా ? నన్నుగుర్తించే ఇన్నాళ్ళూ... చెప్ప కుండా (అమితసంతోషంతో) మనూ... మనూ... (అంటూ లైపుకునడుస్తాడు)

విమ—గు ర్తించింది. అందుకే నే అనురాగాన్ని తెలిసి నీకిలా అర్పించగలిగింది.

మధు—అవును. నిజానికి అంతఅనురాగంచూపటంవల్ల నే—నేనూ......

విమ—అదృష్టం. ఒదిన నిన్ను గుర్తించలేక, ఎవరో పరాయి వాణ్ణిచేసుకన్నాననే భ్రమపడివుంటే...! ...ఎంతదురదృష్టం తప్పింది!

మధు—ఆ అనురాగమే అన్యమనస్కుణ్ణైనా, నన్ను ఆకర్షించగలిగింది.

[మనోరమవచ్చి దూరంగానుంచుంటుంది]

విమ—అయితే అనురాగంతో అనురాగాన్ని సాధించవచ్చంటావా?

మధు—అనురాగాన్ని సాధించటానికి సాధనమే, అనురాగమేను!

విమ—అయితే నాసందేహాలన్నీ అసందర్భాలవుతాయి.

మధు—దానికి మాజీవితమే తార్కాణం.

విమ—అయితే కానివ్వండీ పెళ్ళిచూపులతతంగం.

శర్మ—ఇంకా కానివ్వటానికేముందీ? దొంగల్నించి ప్రభూను రక్షించటానికి చక్కగాపనికివస్తావ్.

[ఇంతవరకూ పరధ్యానంలోవున్న ప్రభు, అప్పుడు స్మృతిలోకివచ్చి]

ప్రభు—ఊ, ఏమంటూరూ?

శర్మ—విమల పెళ్ళిచూపులకి ఒప్పుకుంది. నీకునచ్చిందో లేదో చెపితే,......తర్వాతసంగతి మాట్లాడదాం.

ప్రభు—ఊ! ముందు నేనునచ్చానో లేదో చెప్పమనండి.

శర్మ—ఏమమ్మా! నీసంగతి ముందుచెప్పమంటున్నాడు. పోనీ నాతో కాకపోతే మీ ఒదినతో చెప్పు. కనుక్కో—వమ్మా (మనోరమవిమలదగ్గరకొస్తుంది. ఇద్దరూగుసగుసలు ఆడుకుంటారు.)

శర్మ—ఏమన్నదమ్మా?

మనో—ముందు వారినే చెప్పమంటున్నది.

శర్మ—ముందు అతన్నా! ఏమయ్యా?

ప్రభు—నా అనురాగాన్ని ఎల్లాగయినా ఒలకపోయగలను. ముందుమాట ప్రకటించే రానియ్యండి.

శర్మ—బాగానే వుంది; చెప్పవమ్మా నువ్వు చెప్పు.

విమ—వారేగా! "ఆదర్శప్రాయమైన యువతి" కోసం వెతుకుతున్నారు. వారినే చెప్పమనండి.

శర్మ—నువ్వే వెతుకుతూ వచ్చావుటయ్యా! నిన్నే అతుకుతుందో అతకదో చెప్పమంటోంది.

ప్రభు—నన్నేం చెప్పమంటారు? నేనింతవరకూ ఆగ్రహం చూశానుగాని అనురాగం చూడలేదుగా!

(అందరూ నవ్వుతారు.)

శర్మ—మహా! ఇట్లా కాదోయ్— ఇట్లారా! (మనోరమతో) అమ్మాయీ నువ్వుకూడా. ఇద్దరూ యిట్లారండి. [అంటూ

గుమ్మందాకా ఇద్దర్నీ తీసికెళ్ళి వెనక్కి తిరిగి (ప్రభాతో) మేం అవతలకు వెళుతున్నాం. మీరు ఇద్దరూ అటో యిటో తేల్చి, మమ్మల్ని కేకవెయ్యండి, అందాకా మేమెవ్వరం లోపలికిరాము. తెలిసిందా?

ఆ! ఇహాపదండోయ్ -(వెళ్ళబోగా)

ప్రభ—అదేమిటంటోయ్ !

విమ—ఛ, అదేమిటీ?

శర్మ—అది అంతే. పదవోయ్ మధూ. పదండి.

[ముగ్గురూ బయటకు వెళ్ళగా సిగ్గుతో ప్రభా-విమలా కూర్చుంటారు.]

—: తెర :—

: పాత్రలు :

రామచంద్రం
సుందరం
పురుషోత్తం
నాగలింగం
రంగారావు
శశిరేఖ
మరికొందరు మనుష్యులు
పోలీసులు

పల్లెటూరి వాతావరణం.
వలసిన చోట్ల పాటలు పెట్టుకోవచ్చును.

## రంగం - 1

[రామచంద్రంగారి పెంకుటిల్లు. సామాన్యపు పెంకుటిల్లు. లోపల సామాన్లుకూడా పాతివే. ప్రతి వస్తువులోనూ బీదతనం కనబడుతుంది. తెరఎత్తగానే—

శశిరేఖ పాటపాడుతూ కనబడుతుంది. పాటపూర్తవకుండానే సుందరం వచ్చి పాడుతూవున్న శశిరేఖను చూశి నవ్వి వెనకగా వచ్చి– కళ్ళు మూస్తాడు– శశిరేఖ పాటఆపి.]

శశి—అబ్బ ఎవరది ?

సుంద—ఎవరో చెప్పుకో చూద్దాం.

శశి—ఇంకెవరూ ఊళ్ళో పనీపాటా లేకుండా చదువూసంధ్యా లేకుండా, తిరుగుతున్న వాళ్ళెవరుంటారు ?

సుంద—(వదిలేసి) ఆ, నేను చదువూ సంధ్యా లేకుండా తిరుగుతున్నానా! చూడు ఎన్ని పుస్తకాలున్నాయో ?

[బల్లమీద వున్న పుస్తకాలు చూపిస్తాడు]

శశి—ఆ, చాలా పుస్తకాలు తెచ్చిపెట్టావే.

సుంద—ఆ - చాలా తెచ్చానుగాని, నీకొద్దులే అవి. నే చదువుకోటానికి తెచ్చాను.

శశి—నీకింకా చదువేమిటి? పరీక్షలయిపోయాయిగా.

సుంద—పరీక్షలయిపోతే చదువులయిపోయినట్టేనా ఏమిటి?

శశి—అవున్లే ప్యాసయినవాళ్లు చదవనక్కర్లేదుగాని ఫెయిలయ్యేవాళ్ళు మళ్ళా చదువుతూ ఉండటమే మంచిది.

సుంద—ఊ! నే ఫెయిలవుతానంటావా అయితే ?

శశి—మరి ఎందుకొచ్చిన చదువు- సెలవుల్లోగూడా!

సుంద—ఎందుకా! ఇంకా బాగా చదవటానికి. ఇంకా పెద్ద పరీక్షలు ప్యాసవటానికి, ఇంకా పెద్ద ఉద్యోగంలో చేర టానికి, పెళ్ళాం బిడ్డల్ని యింకా బాగా పోషించడానికి.

శశి—పెళ్ళాం బిడ్డల్ని పోషించటానికి అంత చదువు చద వాలా, చెట్టుకింద మంగలి పోషించటం లే!

సుంద—ఛ ఛ మంగలికీ నాకూ ఏంసంబంధం?

శశి—ఉన్న సంబంధమే. నువ్వెంత చదువు చదివినా వాడి చేతిలో తల పెట్టకుండా వుంటావా ? భగవంతుడికీ- మంగలాడికీ తల వంచకుండా ఏ మగవాడికీ తప్పదు.

సుంద—అది వేరు ఇది వేరు. నా పెళ్ళాం బిడ్డల సంగతి సామాన్యంగా వుంటుందనుకున్నావేమిటి. షికారు కెళితే కారులో వెళ్ళాలి. బజారు కెళ్ళి తిరిగి వస్తే బజారంతా బావురుమనాలి.

శశి—అదేమిటి ?

సుంద—అంటే ఏముంది. బజారులో వున్న సరుకంతా ఖాళీ చేస్తుందన్నమాట.

శశి—ఎవరు ?

సుంద—మరే- నాపెళ్ళాం.

శశి—అబ్బో!

సుంద—ఇంకా విను. ఇంట్లో గదికొక నౌకరు, వంటింట్లో వకరు- దొడ్లో యిద్దరు. సావిట్లో ఒకరు- ఇంటిముందు ఇద్దరు-

శశి—ఎందుకంతమంది ?

సుంద—ఉండాలి ఉండాలి, పిల్లవాడికొక పంతులు పిల్లకొక దాసీది.

శశి—ఎందుకంతమంది అనవసరంగా.

సుంద—ఉండాలి శ్రీ శ్రీ K. V. S. సుందరంగారంటే ఏమనుకున్నావ్?

శశి—ఉత్తకబుర్లు చెప్పే ఖాతాఖానీ రాయడమనుకున్నాను. లేకపోతేట గదికొక నౌకరట డబ్బు దండగ.

సుంద—ఊఁ డబ్బుదండగంటావా ?

శశి—కాపూమరి- ఏపోపోసి యిద్దరు నౌకర్లు ఒక మగ వాడూ- ఒక ఆడది. లేకపోతే వంటకి మరొక్కరు. పిల్లలకొక ప్రయివేటు మాష్టరు. అంతేగాని,

సుంద—పోనీలే అల్లాగే.

శశి—ఇప్పుడల్లాగేనని తలవ్రాపి. తర్వాత నీయిష్టంవచ్చి నట్లు ఖర్చుపెడితేమాత్రం ఊరుకోనేద లేదు.

సుంద—ఊరుకోక ఏంచేస్తావేం కొడతావా ?

శశి—కొడతానా కొట్టిచూపిస్తానా ?

సుంద—బాబోయ్ కొట్టటమే !

శశి—ఆ-చింతబెత్తాలతో చావగొడతాను.

సుంద—నన్నే-సరే కొడితేకొట్టావ్ గాని మొగుణ్ణిగనక శాస్త్ర నిమ్మదిగాగొట్టు ఏం?

శశి—ఛీ-నువ్వూ మొగుడివేమిటి?

సుంద—మరి పెళ్ళిచేసుకుంటే మొగుణ్ణేగా?

శశి—ఛీ-పో- పాడుమాటలు.

[అక్కడికి నిమ్మదిగా రామచంద్రంగారొచ్చారు. 60ఏళ్ళ వృద్ధుడు.]

రామ—ఇక్కడేవున్నావా సుందరం? నీకోసం కనకయ్యని మీయింటికిపంపాను. చూడూ! మనపూర్ణచంద్రంగారి పెద్దబ్బాయి నీతోబాటు చదువుకుంటున్నాడు కాదూ?

సుంద—అవునండి. మేమిద్దరం మొన్న మొన్నటిదాకా కలిసే చదువుకున్నాం.

రామ—ఆ-ఆ-అదే అందరూఅంటున్నారు. చూడూ అతను బుద్ధిమంతుడేగా?

సుంద—ఆ-ఆ- బుద్ధిమంతుడే.

రామ—నీకంటె కొంచెం ఎక్కువమార్కులతో ప్యాసవుతాట్టగా?

సుంద—ఆ కొద్దిగా, ఎక్కువ మార్కులేవస్తాయి.

రామ—నీకంటె కొంచెం ఆస్తికూడాఎక్కువేనట!

సుంద—ఆ వాడివంతు నాల్గుఎకరాలువస్తుంది.

రామ—నీకంటే ఓఛాయ ఎర్రగావుంటాట్ట.

సుంద—ఆ ఉంటాడు.

రామ—చూస్తా నువ్వు ఉన్నదివున్నట్లుగా చెపుతావ్ గనక అడుగుతున్నాను. అతను - మనశశిరేఖను చేసుకుంటే బాగుంటుందంటావా ? బాగుండదంటావా ?

సుంద—శశిరేఖనా ! మనశశినా ?

రామ—ఆ- మనశశినే !

సుంద—అంటే మీఅమ్మాయిని ?

రామ—ఆ-దీన్నే ఏం బాగుండదూ ?

సుంద—బాగానె వుటుంది.

రామ—చూశావా అమ్మాయ్! సుందరం కూడా బాగానే వుంటుందన్నాడు. ఇంకేం వెళ్ళి వాళ్ళవాళ్ళతో మాట్లాడి- ఖాయంచేసుకువస్తాను

శశి—నాన్నా !

రామ—ఏమమ్మా ఏం ?

శశి—ఏంలేదు.

రామ—ఏంలేదూ! అయితే మరివెళ్ళివస్తా (వెళ్ళపోగా)

[శశి సుందరందగ్గరికి గబగబావెళ్ళి]

శశి—పో-సంబంధం బాగుండదనిచెప్పు.

సుంద—నేచెప్తే బాగుంటుందా ?

శశి—మరిసంబంధం కుదిరిస్తే బాగుంటుందా ?

రామ—ఏమిట్రా ఖంగారుపడ్తారూ ?

శశి—ఏంలేదు.

రామ—ఏంలేదూ ? ఏకోవుంది ఏంసుంతరం?

సుంద — ఏంలేదండీ, శశికి ఆసంబంధం యిష్టలేదండీ.

రామ — ఆ దానిదేముంది-చిన్నపిల్ల దానికేం తెలుసు. నువ్వు చెప్పు. నీ అభిప్రాయంలో ఈసంబంధం బాగుంటుందా, బాగుండదా?

సుంద — బాగుండదనే-

రామ — బాగుండదూ? ఏం నీకంటె ఆ స్త్రీఎక్కువ!

సుంద — ఎంతఎక్కువలెండి అరఎకరం.

రామ — వాడికి నీకంటే ఎక్కువమార్కులువస్తాయి.

సుంద — అది క్లాసుపరీక్షల్లోలెండి.

రామ — వాడు నీకంటె ఎరుపు.

సుంద — ఎరుపేగాని మరీఅంతఎరుపైనా? బాగుండదు.

రామ — అయితే నువ్వనేదిఅతనికంటె నువ్వెతగినవాడివనా?

సుంద — ఆ సంగతి నేనంటే ఏంబాగుంటుంది- మీరుఅనాలి.

రామ — నేనంటే మాత్రం- ఏం బాగుంటుంది. అంటే అమ్మాయి అనాలి; ఏమమ్మా ఏమంటావ్- ఎక్కువ ఎరుపయితే అసహ్యంగా వుండదూ?

శశి — నిజమే నాన్నా ఛీ ఛీ- అంత ఎక్కువయితే, అసహ్యంగా ఉంటుంది.

రామ — అయితే సరే, ఆ సంబంధం మాట్లాడనే మాట్లాడను. సరాసరి మన సుందరం నాన్నగారి దగ్గరకే. వెళ్తాను. వెళ్ళి సుందరం సంబంధం కుదుర్చుకు వస్తాను. వస్తానోయ్ సుందరం, (అంటూ బయటకు వెళతాడు)

[శశిరేఖ సుందరం ఒకరివంక ఒకరు చూసుకుని సిగ్గు పడ్తూ నుంచుంటారు. కాసేపు తరువాత]

సుంద—అమ్మదొంగా ఎక్కువ ఎర్రగావుంటే బాగుండదేం?
శశి—అదిగో! అల్లా మాట్లాడితే నాకోపం వస్తుంది.
సుంద—ఎల్లా మాట్లాడాను? నువ్వు మీనాన్న దగ్గర అన్న మాటలే, నేనూ అన్నానుగాని వేరేం అనలేద!
శశి—చాల్లే వూరుకో, నేనన్నమాటలు అట్లా నీకుమల్లే కళ్ళల్లోకి చూస్తూ అన్నానా?
సుంద—నేనెట్లా చూశానేం?
శశి—ఎట్లా చూశావో నే చెప్పాలి? కొంటెగా చూసి.
సుంద—కొంటెగానా? అదేమిటో నాకసలు తెలియదే.
శశి—తెలియదు పాపం. చూపులు గుచ్చుకుంటే సిగ్గొచ్చి నేను చస్తుంటే!
సుంద—నాదగ్గరింకా సిగ్గెందుకు?
శశి—నీ దగ్గర కాకపోతే ఇంకొకరి దగ్గర నాకు సిగ్గెందు కొస్తుందీ. కోపం వస్తుంది.
సుంద—అబ్బో కోపం వస్తుందేం?
శశి—మరిరాదూ అట్లా చూస్తుంటే!
సుంద—కోపం వస్తే వచ్చిందిగాని కొట్టకు.
శశి—ఎందుకొట్టను. కోపం వస్తే.
సుంద—అయితే కొడతావా?

శశి—ఆ దవడ బద్దలు కొడతాను.
సుంద—ఏదీ కొట్టు చూద్దాం.
శశి—నువ్వూ చూడు చూద్దాం.
సుంద—(చూస్తూ) ఇదుగో కొట్టు చూద్దాం?
[శశిరేఖ లాగి కొడుతుంది]
సుంద—అబ్బా!
శశి—అరరే! (నాలిక కరుచుకొని) దెబ్బ తగిలిందా?
సుంద—తగలదూ అల్లా కొడితే.
శశి—నా చేతులు కాలిపోనూ. బాగా తగిలిందా. నా చెయ్యి మంటపుడుతోంది. అంత పెద్ద దెబ్బ తగుల్తుందనుకో లేదు.
సుంద—పన్ను ఊడలేదుగాని, ఊడాల్సినంత దెబ్బ తగిలింది.
శశి—సరిగ్గా చూడు కదలడం లేదుగదా ?
సుంద—లేదులే.
శశి—అయినా, ఎట్లా చూశినా అంత దగ్గరకొచ్చి చూట్టం ఎందుకూ. బాగా చేతికందేటట్లు కాస్త దూరంగా ఉండరాదూ. ఆగు- కాస్త తడిగుడ్డతో అద్దుతాను.
[సుందరాన్ని కూర్చోపెట్టి తడిగుడ్డతో చెంప అద్దుతుంది. అంతలో బయటనించి రంగారావు వస్తాడు. సుందరం శశిరేఖల్ని చూసి ఉలిక్కిపడి వెళ్ళిపోబోతాడు]
సుంద—(అతన్ని చూసి) వెళ్తావేం? రా- రా.
రంగా—ఆ వెళ్తాలే! మీరిద్దరూ...

సుంద—ఏం లేదులే రా

రంగా—ఏం లేకూ. (దగ్గర కెళ్ళి) ఏం లేకపోవటమేం? నీగూబ మీాద 1, 2, 3, 4, వేళ్ళు కనుపిస్తూంటే.

సుంద—ఆ అయిదూ వుండే వుంటాయి.

రంగా—ఉన్నాయి ఉన్నాయి. అయిదూ ఉన్నాయిగాని ఆ అయిదువేళ్ళూ ఎవరివీ అని.

సుంద—ఇంకెవరివీ, శశిరేఖవే!

రంగా—శశిరేఖ! మన శశివే ఇదేమిటే శశీ! ఎందుకట్లా కొట్టావ్? అంత గట్టిగా లెంపకాయ ఎట్లా కొట్టావ్.

శశి—ఎట్లాగేముంది, ఇట్లా నుంచున్నాడు. (రంగారావును సరిగ్గా నుంచోపెడుతుంది) నేనిట్లా వచ్చాను, (కొంచెం దూరంగా వెళ్ళి అతనిమీాదకు గబగబా వస్తుంది) ఇట్లా కొట్టాను. (లెంపకాయ కొడ్తుంది).

రంగా—అబ్బా! (సుందరం వద్దకు ఏడుపు మొహంతో వెళ్ళి) అయిదు వేళ్ళూ పడ్డాయిరా?

సుంద—లేదు నాల్గువేళ్ళూ బాగా తేలాయి అంతే.

రంగా—అంతే, శశి! వాడికి అయిదువేళ్ళూ తేలాయి. నాకు నాలుగువేళ్ళేనా? ఆ కొరవకూడా పూర్తిచెయ్యవ్?

శశి—ఛీ పో.

రంగా—అదేమిటి? వాణ్ణికొట్టి చన్నీళ్ళగుడ్డవేసి నన్నుకొట్టి ఛీపో-అంటావ్!

శశి—అంటాను. ఇంకా నువ్విక్కణ్ణించి వెళ్ళకపోతే కర్ర పుచ్చుకు చావబాత్తానుగూడా.

రంగా—ఆ-చావబాదినతర్వాత చన్నీళ్ళగుడ్డవేస్తావా ?

శశి—కాదు వేన్నీళ్ళగుడ్డవేస్తాను. లేకపోతే,

రంగా—ఒహో వేడి వేడి ప్రేమకాబోలు.

శశి—ఇంకాకదలకపోతే కుంపటీ బొగ్గులు తెచ్చి నెత్తిన పోస్తాను.

రంగా—అబ్బో అంత వేడే !! అంత వేడివద్దు. కొంతతగ్గించు.

శశి—వెళ్తావా, కుంపటీ బొగ్గులూ తెమ్మన్నావా ?

రంగా—ఇదెక్కడికుంపటి ?

శశి—ఇదిగో యిప్పుడే తెస్తానాగు.

రంగా—ఎందుకూ వెళ్తాగాని, కాని......

శశి—కాని ?

రంగా—నాన్న నన్నిక్కడేవుండమన్నాడు. తనువచ్చేదాకా.

శశి—ఎందుకూ ఇక్కడ ?

రంగా—అందుకే-పెళ్ళికి.

శశి—పెళ్ళా ! ఎవరిది?

రంగా—మనిద్దరి దే! అదేం పెళ్ళోగాని...నేను లెంపకాయల పెళ్ళని అనుకోలేదు.

శశి—అయితే తొందరగా వెళ్ళి మీ నాన్నతో చెప్పు. పెళ్ళి అయిపోయిందీ అని లెంపచూపించు.

రంగా—హో తా! వస్తా సుందరం. నీకయిదు వేళ్ళు. అదృష్టవంతు డివి. నువ్వుండు నేవెళ్తా. మీనాన్నకీ మానాన్నకీ చూపిస్తా అక్కడగుడిదగ్గర యిద్దరూ మాట్లాడుతున్నార్లే. వస్తా నీకయిదూ, నాకునాల్గే!

[వెళ తాడు-శశి సుందరం నవ్వు తారు]

సుంద—పాపం.

శశి—లెంప ఏమంటోంది.

సుంద—తగ్గిందిలే శశీ. . . .ఇక. . .మన పెళ్ళి. . .సంగతి. . .

శశి—అయిదురోజుల పెళ్ళా-అయిదు వేళ్ళ పెళ్ళా?

సుంద—రెండూనూ. ఈ అయిదు వేళ్ళూ ఈ అయిదు వేళ్ళూ కలిస్తేనేగా అసలు పెళ్ళి.

[చేయిపట్టుకుంటాడు. ఇద్దరూనవ్వు తారు పాటపాడ తారు. పాట పూర్తవబోతుండగా బయటనించి రామచంద్రం పురుషోత్తం నాగలింగం వస్తారు]

పురు—ఇదేమిటి? ఇద్దరూ పాటలు పాడుతున్నారా? బలే సుందరం నువ్విట్లారా! ఇక్కణ్నించి మొదలకుండాబయటకు వెళ్ళు.

సుంద—ఏం! ఎందుకూ?

పురు—ఎందుకో అంతా తర్వాత తెలుస్తుంది. ముందిక్క ణ్ణించి వెళ్లు.

నాగ—వెళ్లుసుందరం. పెద్దవాళ్లు చెప్తుంటే వినటంమంచిది. వెళ్ళు.

పురు—తెలిసిందా-వెళ్ళు.

సుంద—కాని ఇంకా సరిగా తెలియలేదండి. ఈయిల్లు రామచంద్రంగారిది. వారు వెళ్ళమంటేగాని వెళ్ళను.

పురు—వారు వెళ్ళమంటేగాని వెళ్ళవేం? అయితే ఆయన్నే అడుగు.

సుంద—ఏమండీ!

రామ—(విచారంగా) వెళ్ళునాయనా?

సుంద } ఆ,
శశి } నాన్నా!

పురు—తెలిసిందా ఇక వెళ్ళు.

నాగ—వెళ్లు నాయనా! పెద్దవాళ్ళు చెప్తుంటే వెళ్ళటమే మంచిది.

సుంద—సరే వెళతాను

శశి—నాన్నా! (అంటూ రామచంద్రందగ్గరకు జాలిగా వెళుతుంది)

రామ—సుందరం (దుఃఖంతో నిమ్మదిగా అంటాడు సుందరం ఆగుతాడు) మరేమీ అనుకోకు నాయనా.

సుంద—సరే, (వెళ్ళబోతాడు).

రామ—(బిగ్గరగా) సుందరం! వెళ్ళకు వుండు వెళ్ళవద్దు. ఏమయినాసరే, వుండు.

సుంద—ఉండనీ!

రామ—ఆ ఉండు. బ్రతికిఉండీ, నా కన్నకూతురు గొంతు కొయ్యలేను. వుండు.

పురు—అయితే ఇద్దరూ ఇంట్లోనించి వెళ్ళాల్సి వస్తుంది. రామచంద్రం మళ్ళీ చెప్తున్నాను. ఇంకా ఎన్నిసార్లు కావాలంటే అన్ని సార్లు చెప్తాను మా అబ్బాయికి మీ అమ్మాయి నివ్వకపోతే రేపే దావా వేస్తాను. ఎల్లుండి జప్తు, ఆవలెల్లుండి మీ కాపురం చెట్టుక్రింద, పెట్టుకుంటావో కాలవగట్టున పెట్టుకుంటావో ఆలోచించుకో! ఇహ నే వెళతాను రావయ్యా నాగలింగం రా.

నాగ—వస్తాగాని మనం సుందరాన్ని పంపటానికి వచ్చాంగాని మనం వెళ్ళటానికి కాదే.

పురు—కాదు కాని రా. ఇంకేందుకూ, ఆలోచన రేప్పొద్దున్నే ప్లీడరుగారి దగ్గరికు వెళ్ళి రేపీపాటికి దావా వేసి.

నాగ—దావా వేస్తేమీ అబ్బాయికి పెళ్ళవుతుందని చెప్పండి. దావాలవల్ల విడాకులౌతాయి. గాని పెళ్ళిళ్లు కావుగా నా మాట వినండి. ఏదో పెద్దలు చెప్పినట్టు పోవటం అందరికీ మంచిది. కావాలంటే వెయ్యి నూటపదహారులు ఎదురు పెడ్తారు. బాకీ రద్దు చేస్తారు. రామచంద్రయ్యగారూ! బాగా ఆలోచించండి.

పురు—వెయ్యి నూటపదహారులా! సరే కానివ్వండి. మిమ్మల్ని మధ్యవర్తిగా తెచ్చుకున్నాము కనుక ఆ మాత్రం ఆగుదాం రాయుడూ.

నాగ—రామచంద్రంగారూ మీరేమంటారు?

రామ—నేనేమననూ చెప్పండి నిల్చున్న పాళంగా 10 వేలు ఎక్కణ్ణించి తేను. చూస్తూ చూస్తూ దాని గొంతు ఎట్లా కొయ్యను.

నాగ—మళ్ళా మొదటికొస్తున్నారు. ఇప్పుడు మీగొంతు సంగతి చూసుకోండే అక్కడగుళ్ళో పెళ్ళికి వప్పుకుని ఇక్కడ పిల్లనుచూశి జారిపోతారేం ?

రామ—మీరేమన్నా అనండి. ఇహనన్ను బాధపెట్టకండి ఇహదయచేశి వెళ్ళండి.

పురు— ఆ.

రామ—అంతే. ఒక్కకూతురు దానిపెళ్ళిచేసి నాబాధ వదిలించుకో లేకపోను.

పురు—అయితే కానియ్యి! కానియ్యనయ్యా. కానీ ? ఎట్లా పెళ్ళికానిస్తావో చూస్తా? ఏమనుకున్నావో పురుషోత్తమంటే పురుషోత్తమంటే తాచుపామన్న మాట.

సుంద—తాచుపాముకు ఒక్కకోరల్లోనే విషముంటుంది. మీరు తాచుపాముకాదండీ. అయితే కట్లపాము అవుతారు.

పురు—ఆ-ఆ-ఏపామయితే ఏం పగబడితే. నేను పగబట్టిన పరమేశం ఏమయ్యాడో ఎరగవ్. ఇవ్వాళ బస్తీలోచేరి బస్తాలుమోస్తున్నాడు. సుబ్బయ్య రోడ్లుశుభ్రంచేస్తున్నాడు. పశుపతి కైలాసనివాసం చేస్తున్నాడు. ఏమనుకున్నావ్ పురుషోత్తమంటేః

సుంద—అయితే పశుపతిగాణ్ణి పరలోకానికిపంపింది తమరే నన్నమాట?

పురు—ఆఁ!

శశి—ఆ. ఆ! తప్పుడుసంతకంపెట్టి పరమేశంఆ స్త్రీ కాజేసిందీ యీాయనే.

పురు—ఆ.

సుంద—ఆ స్త్రీకోసం అమ్మాయి కాపరాన్ని కూలదోసి అల్లుణ్ణిచంపించింది యీాయనే.

పురు—ఆ.

శశి—ఆ స్త్రీకోసం అబ్బాయిని చదివించక వతిశుంఠగా తయారుచేసి దీ యీాయనే.

సుంద—పురుషోత్తంట! పురుషోత్తం. పో పోనయ్యా! నువ్వు పురుషుల్లోనే కాదు, పురుగుల్లోగూడా వుత్తముడివి కాదు.

పురు—నన్ను పురగంటావుట్రా!

సుంద—అవును.అంతే. ఇవ్వేనామీాదకు దెబ్బలాటకువస్తాయి.

పురు—నాగలింగం!

నాగ—ఏం పురుషోత్తం!

పురు—ఏమన్నావ్?

నాగ—పురుషోత్తం అన్నాను.

పురు—నువ్వూనా?

నాగ—ఏం నేనూనూ. ఆకుర్రవాడికున్న బుద్ధి నాకులేకపోతే ఎట్లా?

పురు—అయితే నువ్వూ వాళ్ళల్లో చేర్తావా?

నాగ—చేర్తావా ఏమిటి? చేరా ఇదిగో పెద్దవాణ్ణిగనక చెప్తున్నాను. నామాటవిను. విని మీకు(రాడికి పెళ్లేచేయక. చేశావా నీకు ఆ స్త్రీరామునగదా, ఇంట్లో మంచినీళ్ళు గూడా పుట్టవ్.

పురు—చూద్దాంగా; వీళ్ళు పిల్లనివ్వకపోతే ఆగిపోతుందా కట్నమిచ్చి పిల్లనిస్తామనీ, పెద్దపెద్దలే తిరుగుతున్నారు. చూస్తా రేపీపాటికి పెళ్లి చేస్తా! మీరుపెళ్లి ఎట్లాచేస్తారో పెళ్లి యెట్లాజరుగుతుందో, పెళ్ళయినతర్వాత కాపురం ఎక్కడఉంటుందో, అంతాచూస్తా.

నాగ—ఆ! ఆ. తీరుబడిగాచూడు.

పురు—ఆ చూస్తా. తీరుబడిగా చూస్తా. పురుషోత్తమంటే ఏమనుకున్నావ్? ఏమనుకున్నా రేపీపాటికి నోటీసుఅందిన తర్వాత అనుకో.

[పురుషోత్తం వెళతాడు అందరూ రామచంద్రంవంక దీనంగా చూస్తారు.]

శశి—నాన్నా!

రామ—అమ్మా! మీఅమ్మ నిన్ను దిక్కుమాలినదాన్ని చేసి తాను చనిపోయింది. నేను బ్రతికుండీ, నిన్ను దిక్కుమాలినదాన్ని చేస్తున్నానమ్మా!

శశి—నాన్నా!

రామ—వీడు ఈ పురుషోత్తం పగబడితే వదలడు. నిన్నూ నన్నూ నడివీధిన పడేస్తాడు. తెలిసివుండీ వేరేవిధం లేక,

వాడిదగ్గర ఋణం చేశాను. ఉన్న ఆస్తి నాడుకట్టుకుపోతే,
కట్టుబట్టలే మనకిమిగిలేది.

సుంద—అంత ఋణం ఎందుకు చేశారు?

రామ—చేసిన ఋణం తక్కువే నాయనా! అంతా అయిదు వేలు లేదు. ఇబ్బందిలో యిరుకునబడి 1–0–0 వడ్డీకి పది వేలకి నోటు రాశాను. అంతా కలిసి 18 వేలయింది.

శశి—పోనీలే నాన్నా! ఆస్తి లేకపోతే బ్రతకలేకపోతామా!

నాగ—ఆస్తిమాత్రం ఎందుకుండదు. శాస్త్ర వ్యవహారంలో చాకచక్యం చూపిస్తాం.

సుంద—ఏం చాకచక్యం చూపిస్తాం?

నాగ—అల్లాఅడుగు చెప్తా. నోటు వ్రాశి యిచ్చారా ముందు. ఆ సంతకం ఆనోటు నాదికాదనాలి. తర్వాత సాక్షుల్ని కూడగట్టుకొని ప్రతిఫలం ముట్టలేదనాలి. అందాకా ఎందుకు? వంద. రూ॥లు ఇట్లా పడెయ్యి. ఆనోటే గల్లంతయిపోయే పద్ధతి నే ఏర్పాటు చేస్తా.

సుంద—ఆఁ!

నాగ—ఆ మరేమనుకున్నావ్! చేతిమీద రూపాయి ఖంగున మోగితే, సీలుపెట్టెలో నోటుకాగితాలు భరతనాట్యం చేస్తాయి మనం చెప్పినట్లు.

సుంద—కాని ఇది న్యాయమా?......

నాగ—న్యాయం! న్యాయం - అన్యాయం ఎక్కడున్నా వుంటాయి గాని కోర్టులో మాత్రం వుండవ్. నువ్వూ నేనూ

న్యాయం, అన్యాయం విచారిస్తే ఇక కోర్టు ఏం చేస్తుంది? అదంతా మేం చూసుకుంటాలే పెద్దవాళ్లం. నీదోవన నువ్వెళ్లి పెళ్లిప్రయత్నాలు చేసుకో.

రామ—సుందరం ఇట్లారా. ఇదిగో శశి, శశిని నీచేతుల్లో పెట్టాను. ఈ పెళ్లి ఇంతకంటే ఘనంగా చేయలేను. ఇదే పెళ్లి. పెళ్లి అయిపోయినట్టే. ఇహ శశి బాధ్యతంతా నీది.

నాగ—మీరింత నిరుత్సాహపడకండి. శశి పెళ్లి బ్రహ్మాండంగా చేద్దాం.

రామ—వద్దండీ వద్దు. రామచంద్రం అప్పులపాలై పోయాడనీ, దివాలాతీశాడనీ, లోకంఅంతా అననివ్వండి. అన్యాయం చేశాడనీ, అబద్ధాలకోరనీ. కోర్టుపక్షీ అనీ అనిపించుకోవటం ఎందుకు? దానికంటె నా కన్నకూతురుకే, అన్యాయం చేస్తాను. కడుపులో ఆకలిమంటలో కాలిపోతాను.

నాగ—అబ్బే! అదేం ఆలోచన? మీరూ, పెద్దవాళ్లూ. సరిగ్గా వెనకాముందూ, ఆలోచించండి.

రామ—కనిపిస్తున్న దానికి, ఇక వేరే ఆలోచనలు ఎందుకు? ఆలోచించినకొద్దీ పాడుబుద్ధులు పుడతాయి. బుద్ధిగల వాళ్లు ఆలోచించక పోవటమే మంచిది.

నాగ— కాని మీరు...సరిగా ఆలోచించటంలేదు.

సుంద—ఇంకా ఆలోచన ఎందుకు? నేను ఏదో చదువుతున్నాను. ఇహా చదువాపి ఉద్యోగంలో చేరతాను. ఇద్దరి

పొట్టా పోసుకోలేక పోము. మీరేం బెంగ పడకండి, రామ
చంద్రంగారూ! ఆ స్థిపోయినామనం వస్తులుంచక్కర్లేదు.

రామ—నా విషయంలో విచారం అక్కర్లేదునాయనా! అన్ని విషయాలూ తేల్చేవేశాను. మనస్సులోకూడా విచారం లేదు. ఒక్క శశివిషయం తప్ప.

నాగ—అయ్యయ్యో! రెండు సంవత్సరాలన్నా తీసుకుంటుందండీ విషయం కోర్టులో. మీరేదు రెండు నిమిషాల్లో తేల్చేస్తే ఎట్లా?

రామ—ఇహాపదండి. నాగలింగంగారూ! పెళ్లిజరిగిన ఇంట్లో కోర్టులగోల ఎందుకూ?

నాగ—అంతేనా! ఇల్లా తేలిపోతే, ఇహ నా మొహం నేనెందుకూ? కోర్టు మొహంగూడా ఎవ్వరూచూడరే యిట్లా అయితే. పాపం ఆ ప్లీడర్ల మొహం ఎట్లాచూట్టం.

రామ—ఆవిషయం ఆలోచిద్దాం నిమ్మదిగారండి పోదాం.

[ఇద్దరూ వెళ్లబోతూండగా, రంగారావు ఎదురొస్తాడు. గబగబా]

రంగా ఉన్నావా యిక్కడా! (అని శశిని చూసిఅంటాడు) (తర్వాత అందర్నీ చూసి) ఉన్నారా అందరూ? (వెళ్లబోతాడు. తర్వాత నాగలింగాన్ని చూసి)నువ్వూఉన్నావా! యిక్కడ? (ఏడవబోతాడు.)

నాగ—ఆ ఉన్నా! ఏమన్నా పనివుందా?

రంగా—పనుందిగాని నీతోకాదు. నువ్వుంటే నాపనికాదు నువ్వెళ్లి నాన్నతో చెపితే, నాపనికాస్తా చెడిపోతుంది.

నాగ — నేను మీనాన్నతో ఎందుకు చెప్తాను? మీనాన్నా నేనూ విడిపోయాం. ఇహ మీనాన్నతో మాట్లాడననుగా!

రంగా — ఇప్పుడట్లాగే అంటావ్! రేపు నాన్న పట్నానికి ప్లీడరు దగ్గరకి బయలుదేరంగానే, దస్త్రంపుచ్చుకొని, బండీవెంట పడ్తావ్!

నాగ — కాదు! ఇహ అంతా విరోధమే! మీనాన్నగారిమీద కేసు పెట్టిస్తాగా!

రంగా — నాన్నమీద కేసా! ఎప్పుడు పెట్టిస్తావ్?

నాగ — రేపే!

రంగా — అయితే నాన్నని జైల్లో పెట్టిస్తావా! నిజంగా.
(సంతోషంతో అంటాడు.)

నాగ — ఓ నాలుగేళ్లు.

రంగా — ఎనిమిదేళ్ళు పెట్టించు. అప్పుడు ఆ స్తిఅంతా నాకొస్తుంది. ఈలోపున నాన్న పళ్ళూడిపోయి ముసలాడై పోతాడు.

నాగ — ఓ అల్లాగే. రేపు రామచంద్రయ్యగారి బాకీవిషయంలోనే అయిదేళ్ళు వేయిస్తాగా?

రంగా — రామచంద్రంగారి బాకీవిషయమేనా! ఇదిగో ఆయననోటు తీసుకొచ్చా నాన్నకి తెలియకుండా.

నాగ — నోటా! ఏదీ?

రంగా — అబ్బా! అల్లాయివ్వను. శశిని నాకిచ్చి పెళ్ళిచేస్తానని మాటిస్తేగాని యివ్వను.

నాగ—అల్లాగే మాటయిస్తాంగా! యియ్యి.

రంగా—ఛ. ఇవ్వను. నీమాటనమ్మిందెవరు. ఉత్తపంకర నోటిమనిషివి. రామచంద్రంగారు మాటివ్వాలి. సుందరం సాక్ష్యంయివ్వాలి. శశికూడా ఒప్పుకోవాలి.

నాగ—అంతేగా! రామచంద్రంగారుయిస్తారు. శశి సుందరం గూడా ఒప్పుకుంటారు. ఇయ్యి. ఆనోటుయిట్లాయియ్యి.

రంగా—ఏవీ వాళ్ళుముగ్గురూ, బెల్లం కొట్టినరాయిలాగా ఊరుకుంటారుగాని, ఒక్కమాటమాట్లాడరేం? నువ్వు ఇన్ని మాట్లాడినా?

నాగ—ఊ! రామచంద్రంగారూ! మీనోటివెంటఒక్కమాట ఒదిలెయ్యండి దానికి వ్యవహారమంతా, ౩ నిమిషాల్లో తేలిపోతుంది.

రామ—ఒద్దులెండి. ఆకుఱ్ఱవాడు, అమాయకుడు. వద్దులే. రంగారావ్గూ! ఆనోటు మీ నాన్నకియిచ్చెయ్యి.

నాగ—అదేమిటండీ? అమాయకుడు కాకపోతే, తెలివిగలవాడు తలమీద చెయ్యిపెట్టనిస్తాడా? వ్యవహారమిట్లా తేల్చి వెయ్యకండి. రామచంద్రయ్యగారూ నామాటవిను...

రాము—వినను. ఇట్లా నోటుదొంగలించటానికి అసలువప్పు కోను. మీరేమంటున్నారో తెలుసా? ఇంతాక అన్యాయం చేయమన్నారు. ఇప్పుడు దొంగతనం చెయ్యమంటు న్నారు. ఇందులో ఏది చెయ్యను. చివరకు శశికూడా అన్యాయమైపోయినాసరే, వద్దు. రంగారావ్! ఇకనువెళ్ళు.